అన్నయ్యశాస్త్రి, రాచకొండ

బాజీరాయునిచరిత్ర

చెన్నపురి, 1923

Record no. 760

Annayyaśāstri, Rācakoṇḍa

Bājīrāyunicaritra

Cennapuri, 1923

Record no. 760

Bibliographic Record Target

అన్నయ్యశాస్త్రి, రాచకొండ.
బాజీరాయునిచరిత్ర / కర్త రాచకొండ అన్నయ్యశాస్త్రి.- 1. ముద్రణ.- చెన్నపురి : వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1923.
192 p. ;18 cm.
Record no. 760

Annayyaśāstri, Rācakoṇḍa.
Bājīrāyunicaritra / karta Rācakoṇḍa Annayyaśāstri.- 1. mudraṇa.- Cennapuri : Vāviḷḷa Rāmasvāmiśāstrulu aṃḍ Sans, 1923.
192 p. ;18 cm.
Record no. 760

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB Date filming began:

# హిందూదేశచరిత్రము



(మూడవ ఫారమున కుపయుక్తమైనదై 'సిలబసు'ను ననుసరించి వ్రాయఁబడినది.)

ఇది

విశాఖపట్టణమునందు గల సీ. బీ. యమ్. హైస్కూలులో నుపాధ్యాయుఁడగు

కొల్లూరు జగన్నాథముచే

రచియింపఁబడి



విశాఖపట్టణస్థిత సీ. బీ. యమ్. హైస్కూలునందలి సహాయాంధ్రోపాధ్యాయులగు

బ్ర॥ ఈదరపు వేంకట రామజోగీశ్వర శర్మగారిచే

పరిశోధింపఁబడియె.



విశాఖపట్టణము;

కింగ్ అండు కో ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1924.

వెల రు 0—10—0.]





# విషయసూచిక.

# PREFACE.



I have gone through the manuscript of the 'Indian History' (in Telugu) of the British Period, written by Mr. K. Jagannadham, a teacher of the C. B. M. High School, Vizagapatam. It is with pleasure that I notice that the book has been well written *in close conformity with the Departmental Syllabus* on the subject for Form III. The style through out is simple and easy; and as such the contents of the book can be easily understood by the pupils, for whom it is intended. The information given on the various points is adequate, and well arranged. I hope it will be widely used as a text book in varrious schools.

VIZAGAPATAM,
9-2-1924.

VEPA KAMESAM,
B. A., L. T.,
*First Assistant. C. B. M. High School*
*VIZAGAPATAM.*





ఓమ్.

# హిందూదేశ చరిత్రము



## 1. యూరోపియనులు ఇండియాకు వచ్చుట

ఆంగ్లేయరాజ్యమున నమూల్యాభరణ మని ప్రసిద్ధిగాంచిన మనదేశము వాణిజ్య వ్యాపారమునకు పచరించు వసతులతో నిండియున్నది. ఇందు స్వతస్సిద్ధమగు నౌకాశ్రయములును, లోకప్రసిద్ధంబగు నదులును గలవు. ఇందు గంగ, సింధు, యమున, బ్రహ్మపుత్ర, గోదావరి, కృష్ణ, కావేరి మున్నగు నదులు ప్రవహించుటచే మిగుల సారవంతమైనదై, సిరి సంపదలచే నిండి పూర్వమునుండియు బ్రపంచకమునం దొక ముఖ్యమైన దేశమై వెలయుచున్నది.

ఇట్టిదానితో ఐరోపాదేశస్థులు పూర్వమునుండియు వాణిజ్య వ్యాపారము నలుపుచుండిరి. జహంగీరుకాలమున "సర్ థామస్‌రో" యను నొక యాంగ్లేయుడు, తనదేశపు రాజగు "జేమ్సు" వద్దనుండి మనదేశమునకు రాయబారిగా బంపబడెనన్న సంగతిని మీరు చదివియే యున్నారు. తిరుగ నీత డింగ్లాండునకు బోవునపుడు రాజులవద్ద పెక్కు బహుమానములను గైకొనిపోయెను. వీనివలనను "హాకిన్సు" మున్నగువారివలనను నింగ్లాండులోనున్న వర్తకులు మన మర్యాదలను, మన సిరి సంపదలను దెలిసికొనియుండిరి.

వాణిజ్యవ్యాపారమున కనుకూలమైనదని తెలిసి యూరోపియనులు గొందరప్పుడే మనదేశమునకు వచ్చుచుండిరి. వీరిలో మొదట వచ్చినవారు పోర్చుగల్ దేశస్థులు. వీరికి "బుడతగీచు" లని పేరొక

నామముగలదు. క్రమక్రమముగా 'డచ్చివారు' (హాలండు దేశస్థులు) ఇంగ్లీషువారు, ఫ్రెంచివారును గూడ, మన దేశముతోడను మన దేశమునకు దూర్పు దక్షిణములనున్న 'స్పైసుదీవుల' తోడను వర్తక వ్యాపారమును చేయ మొదలుపెట్టిరి.

వీరు యూరపుఖండమందు దొరుకని సిలిమందు, రవసెల్లాలు, జాజికాయ, జాపత్రి మున్నగు వాసనద్రవ్యముల నిండియానుండి తీసికొనిపోయి 'వెనిస్', 'జినోవా', 'మార్సైలు' మొదలగు పట్టణములలో నమ్ముచుండిరి. ఇచ్చట దొరుకని వస్తువులచ్చటనుండి, చౌకధరలకు గొని, యిచ్చట హెచ్చుధరలకమ్ముచుండిరి.

పూర్వమీ వ్యాపారమంతయు మూడుమార్గములగుండా జరుగుచుండెను. అందులో మొదటిది మార్సైలు, జినోవా మున్నగు పట్టణములనుండి, మధ్యధరాసముద్రముగుండా వచ్చి, ఆఫ్రికాకుత్తరమందున్న 'అలగ్జాండ్రియా' పట్టణమందుండి యెర్రసముద్రముమీదుగ మలబారుతీరమందున్న కళ్ళికోటను జేరుచుండెను. రెండవదికూడ మధ్యధరాసముద్రముగుండావచ్చి ఏషియా మైనరు, సిరియాదేశములద్వారా పోయి బసారాపట్టణముచేరి, అచటనుండి పెర్షియన్ సంయుక్తాగ్రగుడము మీదుగ సూరట్, కళ్ళికోటలకుఁ బోవుచుండెను. మూడవది బాల్కన్ ద్వీపకల్పములోనున్న 'కాన్‌స్టాంటినోపిల్', కాస్పియన్ సముద్రముగుండా, ఆఫ్ఘనిస్థానము. సింధునదివరకును బోవుచుండెను.

పదునైదవ శతాబ్దమున, మహమ్మదీయులు పైనుదహరించిన ఆఫ్ఘనిస్థానము, సిరియా మొదలగు దేశములనుండి యూరోపియన్ క్రైస్తవ వర్తకులను వారిదేశములగుండా పోనీయక హింసించుచుండిరి. కనుక వారితో సంబంధములేని క్రొత్తమార్గము నొకదానిని గనిపెట్టుమని పోర్చుగీసురాజు 'వాస్కోడిగామా' అనువానిని క్రీ. వె. 1497 లో ఇండియాకు బంపెను. ఇతడు సముద్రముమీదుగ నాఫ్రికాఖండమునకు దక్షిణమందున్న 'గుడ్ హోప్' అగ్రమును జుట్టివచ్చి తిన్నగా హిందూమహాసముద్రమార్గమున క్రీ. వె. 1498 లో కళ్ళికోటను



జేరెను. కళ్ళికోటరాజగు 'జామొరిన్' ఇతనిని గౌరవించి వ్యాపారమునకుచితమగు సామగ్రిని వానికొసంగెను. అప్పటినుండియే పోర్చుగీసువారిండియాతో వర్తకము చేయ నారంభించిరి.

క్రొత్తగా వీరీమార్గమును గనిపెట్టుటవలన గొప్పలాభములను వారు పొందిరి. వీరు పూర్వము బిడారులపైని, సముద్రముపైని దమసరకులను దెచ్చుకొనుచుండిరి. కాని యిప్పుడు వీరు కనిపెట్టిన మార్గము కేవలము సముద్రమార్గమేయై యుండుటచే, వీరు తమసామగ్రి నధికముగాను, త్వరగాను, మిగుల సులభముగాను దెచ్చుకొనుటకు వీలుగ నుండెను. ఇందుచే వీరితరవర్తకస్థుల నీమార్గమున వర్తకము చేసికొనుట కొప్పుకొనరైరి.

కనుక వీరితరువాత మనదేశమునకు వర్తకమునకై వచ్చిన డచ్చివారు, ఇంగ్లీషువారు, ఎంత కష్టపడి పనిచేయుచుండినను వారికి నష్టమే వచ్చుచుండెను. అందుచే వారిలో నింగ్లీషువారు 'ఆర్కిటిక్ మహాసముద్రము' మీదుగ నొకక్రొత్తత్రోవను గనిపెట్ట బ్రయత్నించిరి. కాని, ఆర్కిటిక్ ప్రాంతమంతయు మంచుచే నిండియుండుటబట్టి వారిప్రయత్నములు నిష్ఫలములాయెను. కనుక వారును డచ్చివారును గుడ్ హోప్ మార్గమునవనే ఇండియాతో వర్తకము సలుపుచుండిరి.

## 2. తూర్పిండియా సంఘము

హిందూదేశమునకు వర్తకవిషయమై వచ్చిన యూరోపియనులలో మొదటివారు పోర్చుగీసువారు. వీరినిగురించి కొద్దిగా మీరు మొదటి పాఠములో జదివియేయున్నారు. వీరితరువాత వచ్చినవారు 'హాలండు' దేశీయులగు డచ్చివారు. వీరు పోర్చుగీసువారివలె దొలుత మలబారుతీరమున దిగక తిన్నగా తూర్పిండియా దీవులకు 1596 లో బోయి వర్తకముచేయ నారంభించిరి. అచ్చట వీరు "బటేవియా" ను ముఖ్యపట్టణముగా జేసుకొనిరి. కాలక్రమమున తూర్పిండియాతో ననేకులు వర్తకము చేయసాగిరి. వీరందరును 1602 లో

నేకీభవించి "యునైటెడ్ యీస్టిండియా కంపెనీ" అనుపేరున వర్తకము చేయుచుండిరి. వీరు తమవర్తకము నభివృద్ధిజేసికొని, తరువాత ఇండియాతోగూడ వర్తకమునుజేయ మొదలుపెట్టిరి. వీరు పదునేడవ శతాబ్దమున దూర్పిండియా వ్యాపారస్థులలో మిక్కిలి ప్రసిద్ధిగాంచిరి.

తాముగూడ తూర్పిండియా వర్తకమువలన లాభము నొందుదమని లండనులోనున్న యింగ్లీషువర్తకులు గొందరు కుతూహలురై యుండిరి. ఇంతలో 1599 లో డచ్చివారు మిరియముల ఖరీదు పౌను 1 కి 3 షిల్లింగులనుంచి 8 షిల్లింగులకు హెచ్చించిరి. కనుక డచ్చివారి వద్దనుండి మిరియము కొని యమ్మొట వీరి కించుకైనను లాభముగ లేకుండెను. కనుక వీరు 1600 లలో 30,000 పౌనులను చందావేసికొని, "లండన్ తూర్పిండియా సంఘము" అనుపేరున వర్తకము చేయుచుండిరి. ఈసంఘము తొలుత నొక గవర్నరుయొక్కయు, 24 ఆలోచన సభలయొక్కయు ఏలుబడిలోనుండెను. ఇట్లుండ 1698 లో 'ఈస్టిండియా కంపెనీ' అనుపేరున గొందరింగ్లీషువా రిండియాతో వ్యాపారము చేయుచుండిరి. ఆకాలమున నింగ్లాండు నేలెడి "ఎలిజబెత్" రాణీగారియొద్ద శాసనపత్రమొకదానిని వారుపొందిరి. దీనివలన వీరు దప్ప తదితరు లిండియాతోను, దానికి సంబంధించిన దీవులతోను వ్యాపారము చేయగూడదని తెలియుచున్నది.

అందఱును గలసి యైకమత్యముతో బోటీవర్తకము లేక వర్తకము చేసినచో నట్టివ్యాపార మభివృద్ధికి వచ్చుననితలచి వారు 1702 లో నేకీభవించి యునైటెడ్ ఈస్టిండియా కంపెనీ అను పేరున వర్తకము చేయుచుండిరి.

తొలుత వీరు స్పైసు దీవులకు బోయి జాజికాయ, జాపత్రి, లవంగాలు మున్నగు సుగంధద్రవ్యముల నింగ్లాండునకు దీసికొని పోవుచుండిరి. కాని యప్పటికచ్చట వర్తకమునందారితేరి కుదురువడియున్న డచ్చివారు వీరిపై బోటీవర్తకమును జరిగించుచుండిరి. ఇంతియగాక క్రీ. శ. 1623 లో 'అంబాయినా' (Amboyna) యను ద్వీప



మందున్న యింగ్లీషువారిని డచ్చివారు చిత్రవధ గావించిరి. ఎట్టి కష్టములపాలైనను నింగ్లీషువారు తమ పట్టుదల విడువక వర్తకమును జరిగించుచునే యుండిరి.

మనదేశముతో వర్తకముచేయ నుద్దేశించి వచ్చిన యూరోపియనులలో ఫ్రెంచివారొకరు. వీరు క్రీ. శ. 1664 లో నొకసంఘముగా నేర్పడి, ఇండియాతో వర్తక మొనరించుచుండిన వ్యాపారస్థులలో బ్రసిద్ధిగాంచిరి. డచ్చి యీస్టిండియా సంఘమువారివలె వీరును వారి ప్రభుత్వమువారితో సంబంధము గలిగియుండిరి.

## 3. వర్తకశాలలు

వర్తకశాల లనగానేమి? వర్తకశాలలనగా వర్తకముచేయువారు తమసరకుల నుంచుకొని వానిని జాగ్రత్తపరచుటకై నియమించెడి ప్రదేశములు. వీనినే కార్ఖానా లందురు. ఇవి యెట్టి వర్తకునికైన నుండక తప్పవు. గొప్పవర్తకులు పెద్ద వర్తకశాలలను గట్టింపవలెను. ఇట్టివాటిని మీరు పైజదివిన యింగ్లీషు, ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసువారు ముఖ్యముగా సముద్రతీర ప్రదేశములలోను, నదీముఖద్వారపు జోట్లయందును గట్టుకొని తమతమ వర్తకములను జరిగించుచుండిరి.

వీరందఱిలోను ముఖ్యులగు నింగ్లీషువారి వర్తకశాలలనుగూర్చి మీరు మొదట నేర్చుకొనవలసి యున్నది. వీరికి "ఎచ్చటికేగిన యముడడ్డమయ్యె" ననునటుల స్పైసుదీవులను విడచి యిండియాతో వర్తకము చేసికొనుచుండినను నచ్చటగూడను డచ్చివారు, పోర్చుగీసువారు వీరితో బోటీ వర్తకమును జేయుచునే యుండిరి. ఈ బాధకు దోడుగ నింగ్లీషువారి కింకొకవైపునుండి కూడ కష్టము సంభవించుచుండెను. వీరేయే పట్టణములయం దధికముగా వ్యాపారము చేయుచుండిరో, ఆయా పట్టణములను బాలించెడి గవర్నరులు వీరి యభివృద్ధినిజూచి సహింపజాలక వీరి సరకులపై నధికముగా బన్నులను విధిం

చుచుండిరి. ఇంగ్లీషువారి బాధల కోర్వజాలక వారితో జోక్యములే కుండ మదరాసు, బొంబాయి, కలకత్తా మున్నగు ముఖ్య పట్టణముల లో వర్తక వ్యాపారముల కుచితమగు వర్తకశాలలను, కోటలను గట్టుకొనిరి.

వీరీ వర్తకశాలలుండెడి ప్రదేశముల నెటుల సంపాదించుకొనిరో మీరిక జదువవలసి యున్నది. వీరు మొదట సంపాదించిన స్థలము లలో మదరాసు ముఖ్యమైనది. పూర్వము విజయనగర సంస్థానపు రాజులలో నొకడు చంద్రగిరిలో రాజ్యమేలుచుండెను. ఇతనికి 'చెన్నప్ప' నాయకుడను నొకసామంతు డుండెను. ఈ చెన్నప్పవద్దనుండి ఇంగ్లీషు "ఈస్టిండియా కంపెనీ" వారి ఏజంటగు "సర్ ఫ్రాన్సిస్ డే" ఇప్పుడు మదరాసని పిలువబడు ప్రదేశమును క్రీ. వె. 1639 లో గొని యందు వర్తకశాల నొకటి కట్టించెను. దీనినే చెన్నపట్టణ మందురు. శత్రువులవలన భయము లేకుండునటుల నితడచట "సెంటు జార్జి" యనెడి కోట నొకదానిని గట్టించెను. ఈకోట చుట్టుపట్ల నల్లని శరీరముగల సాలెవాండ్రు, స్వదేశీ వర్తకులు మున్నగువా రందరును నివసించుచుండిరి కనుకనే కొంతకాలమువరకు నీ ప్రదేశమును Black Town అని పిలుచుచుండిరి. 1906 లో జార్జి చక్రవర్తిగారు చెన్నపట్టణమునకు దయచేసినప్పుడు దీని పేరును "జార్జిటౌను" (George Town) గా మార్చిరి.

మన దేశమునకు బశ్చిమమున నున్న బొంబాయి నింకొకరీతిగ నింగ్లీషువారు సంపాదించిరి. పూర్వ మొకప్పుడు బొంబాయి ద్వీపము పోర్చుగీసురాజు స్వాధీనమందుండెను. ఒకానొకప్పుడితడు తన కుమార్తె నింగ్లీషుప్రభువగు 'రెండవ ఛార్లెస్' న కిచ్చి వివాహము చేసెను. అప్పుడీతడు బొంబాయిని దనకుమార్తె కరణముగా నొసంగెను. ఆకాలమున బొంబాయి యిప్పటంత గొప్పస్థితిలో నుండక పోవుటచేతను, ఇంగ్లాండున కిది చాలదూరమం దుండుటచేతను రెండవ ఛార్లెస్ప్రభువు బొంబాయి నీస్టిండియా కంపెనీవారికి క్రీ. వె. 1668 లో నమ్మి



వేసెను.

ఇంగ్లీషువారీ రెండుపట్టణములనేగాక బంగాళములోనున్న కాళీఘట్టము (Kalikata) అను స్థలమునగూడ నొకకోటను గట్టిరి. దీని పేరు "ఫోర్టు విలియమ్". క్రీ వె. 1656 లో ఢిల్లీ చక్రవర్తియగు షాజహానుయొక్క కూతునకు జబ్బుచేసెను. చాలమంది వైద్యులు జబ్బును నివారణజేయ బ్రయత్నించిరిగాని వారి ప్రయత్నములు నిష్ఫలములయ్యెను. అప్పుడొక యింగ్లీషు వైద్యుడు (Gabriel Boughton) ఆజబ్బును గుదిర్చినందున, చక్రవర్తి యందులకుప్పొంగి, ఇంగ్లీషువారిని బంగాళములో బన్నుచెల్లించ నక్కరలేకుండ వర్తకము చేసికొన నిచ్చెను. పిమ్మట 1690 లో ఔరంగజేబిప్పుడు కలకత్తానగర మనెడి ప్రదేశమును వీరికిచ్చెను.

ఈ మూడుపట్టణములనేకాక యింగ్లీషువారు సూరటు, కేమ్బే, ఆర్మగాం, మచిలీపట్టణము, చంద్రినాగూర్, కాసింబజారు మున్నగు స్థలములలోగూడ వర్తకశాలలను గట్టుకొని వర్తకముచేయుచుండిరి.

ఇక ఫ్రెంచివారు సూరత్, మాహీ, మచిలీపట్టణము, చంద్రనాగూరు, బాలసూరు, పాట్నా, కాసింబజారు మున్నగు స్థలములలో వర్తకశాలలు గట్టుకొనిరి. వీరుకూడ తూర్పుదేశములతో వర్తకము చేయ నుద్దేశించుటచే వారొక "ఈస్టిండియా కంపెనీ" గ నేర్పడిరి. వీరి ఏజంటగు "ఫ్రాన్సిస్ మార్టిన్" (Francis Martin) క్రీ. వె. 1674 లో బీజపూరు సుల్తానగు "షెర్ ఖాన్ లోడీ" అను వానివద్ద ప్రస్తుతము పుదుచ్చేరి (Pondicherry) యని పిలువబడెడి స్థలమును గొని, అందొకకోటను గట్టించెను. మార్టెను సామర్థ్యముచే త్వరలో పుదుచ్చేరి యొక గొప్పపట్టణ మయ్యెను. దీని సముద్రతీరము వర్తకవ్యాపారమున కుపచరించుటచే దీనిని ఫ్రెంచివా రిండియాలో దమ ముఖ్యపట్టణముగ జేసికొనిరి.

పోర్చుగీసువారు తమ సేనానాయకుండగు "అల్బుకర్కు" కాలమున బీజపూరు సుల్తానగు "యూసఫ్ అడిల్ షా" చనిపోయిన

తోడనే మలబారుతీరమందున్న 'గోవా' పట్టణమును స్వాధీనము చేసికొనిరి. వీరిరాజ్యమున కంతయు నిదియే ప్రధానపట్టణ మయ్యెను. కాలక్రమమున వీరు 'బొంబాయి' 'మలాకా' మున్నగు దీవులను వశపరచుకొని వాసనద్రవ్యముల నధికముగా బోర్చుగలు దేశమున కెగుమతిచేయ నారంభించిరి. మఱియు, వీరు సూరట్, డైయ్యూ, డామన్, సాల్సెట్టు ద్వీపములను లోబఱచుకొని వ్యాపారము చేయుచుండిరి. తురకలవలె వీరు తమ క్రైస్తవమతములో చేరని హిందువులను బాధించుచుండిరి. అదిమొదలు వీరి రాజ్యము, వ్యాపారముకూడ క్షీణింప సాగెను. ఇంతియగాక 1580 నాటికి స్పెయిన్ దేశపు రాజు పోర్చుగల్ దేశమును జయించి స్వాధీనము చేసికొనెను. అందుచే నప్పటనుండి వారిచ్చవచ్చినటుల వ్యాపారము జరిగించుకొనుటకు వీలు కాకుండెను. మఱియు నాకాలమున స్పెయిన్ దేశస్థు లింగ్లీషువారితో బోరాడి, ఓడిపోవుటచే స్పెయిన్ పోర్చుగల్ దేశస్థుల బలము తగ్గెను. ఇంకను 17 వ శతాబ్దమున మనదేశముతో వ్యాపారము చేయుదలచి డచ్చివారు, ఇంగ్లీషువారు మొదలగు వ్యాపారస్థు లందఱును మన దేశమునకు రాసాగిరి. కనుక కొంతకాలమగుసరికి పోర్చుగీసువారి పరిపాలనము మనదేశములో క్షీణించినది. కాని, నేటికిని వీరిరాజ్యములలో గోవా, డయ్యూ, డామన్‌లు మాత్రము నిల్చియున్నవి.

ఇక డచ్చివారు పులికట్, చింసూరా, మచిలీపట్టణము, ప్రళయ కావేరి మొదలగువానిలో వర్తకశాలలను గట్టికొని వ్యాపారము చేయుచుండిరి.

తుదకు ప్రబలి నిల్చియున్న యూరోపియన్ క్రైస్తవ వర్తకుల లో ముఖ్యులు—ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు. వీరిరువురకును సుమారొక్కచోటనే వర్తకశాల లుండుటచే నిరువురును బరస్పర స్పర్థలతో వ్యాపారము చేయుచుండిరి. వీరు కాలక్రమమున దమ వర్తక మభివృద్ధి జేసికొనుటయేగాక స్వదేశ రాజులను వశపరచుకొని దాని మూలమున దమ యధికారము దేశములో స్థాపించుకొనుటకు గూడ



బ్రయత్నించుచుండిరి. అట్టివారిలో ముఖ్యులు ఫ్రెంచివారు. ఈసంగతిని గుఱించి మీరిక వచ్చు పాఠములో నేర్చుకొనెదరు.

## —♦ 4. మొదటి కర్ణాటకయుద్ధము. క్రీ. శ. 1744_1749 ♦—

ఈయుద్ధ మెట్లు జరిగెనో తెలిసికొనక పూర్వము, మీరిండియాయొక్క స్థితినిగూర్చి కొంచెము తెలిసికొనవలెను. 1707 లో ఔరంగజేబు చనిపోయెను. ఇతనితరువాత రాజ్యమునకు వచ్చిన చక్రవర్తులందఱును మిగుల బలహీనులై స్వబుద్ధి నుపయోగించుకొనలేక వారి యాస్థానమందున్న సరదార్లెట్లు చెప్పిన నట్లు నడుచుకొనుచుండిరి. ఇట్టివారిలో "మహమ్మద్ షాహా" యను నతడు ముఖ్యుడు. దేశమందంతటను నల్లకల్లోలము హెచ్చుగ నుండెను. పారశీక చక్రవర్తియగు 'నాదిర్ షాహా' ఇండియాను గొల్లగొట్టి యాభరణములలో బ్రసిద్ధిగాంచిన కోహినూర్ వజ్రమును, నెమిలి సింహాసనమును దోపిడిచేసికొని పోయెను. ఇట్టిస్థితిలో మహారాష్ట్రులు మిగుల ప్రబలుచుండిరి. వీరిలో ముఖ్యులగు బాలాజీ బాజీరావు, బాజీరావు మొదలగువా రందఱును దేశమును దోపిడి చేయుచుండిరి. పరాక్రమవంతులు బాలించువారుగను, బలహీనులు బాలింపబడువారుగను నుండిరి. ఒప్పుతప్పులు విచక్షణ లేకుండెను.

ఇది యిట్లుండ, ఆకాలములో ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును ఇండియాతోడనే గాక ఆఫ్రికా, అమెరికా ఖండములతోడ గూడ వర్తకవ్యాపారములు సలుపుచుండిరి. వీరిరువురకు నెల్లప్పుడు హెచ్చుగ బోటీవర్తకము జరుగుచుండెను. ఇంతియగాక, యూరపుఖండమందు నింగ్లాండు, ఫ్రాన్సు లిరుగుపొరుగులం దుండుటచే నిరువురు బరస్పర స్పర్థలు గలిగియుండిరి. కనుక మొదట నైరోపాఖండమునం దిరువురకును యుద్ధము సంభవించెను. పిమ్మట నొకరి కీరీతిని విరోధ మేర్పడి

యుండుటవలన బ్రపంచమునందు వారు గాపురముండు ప్రతిష్ఠలము నందును యుద్ధములు దటస్థించెను.

1740 లో ఐరోపాయందు భయ కక్షులవారికిని యుద్ధము ప్రారంభము గాగానే యిండియాలోగూడ నిరువురును బోరాడసాగిరి. ఆకాలమందు "డూప్లే" యనువాడు ఫ్రెంచి గవర్నరుగా నుండెను. ఇత డింతకుబూర్వ మిండియా కొకసారి వచ్చియుండుటచే మన దేశపు సంగతి యితనికి బాగుగా దెలిసియుండెను. ఐరోపాయందు యుద్ధము బ్రారంభము గాగానే యితడు పుదుచ్చేరి కోటను మరమ్మత్తుచేయించి యుద్ధసంసిద్ధుడై యుండెను. ఈసంగతి మదరాసులోనున్న యింగ్లీషువారికి దెలిసినవెంటనే పుదుచ్చేరిని వారు ముట్టడించిరి. కాని పుదుచ్చేరి గవర్నరగు డూప్లే వారి నోడించి, తిరుగ చెన్నపట్టణమును ముట్టడించి యుద్దానిని స్వాధీనము చేసికొనెను. తనకు లోబడినవాడగు డూప్లే యిట్లు దనకు దెలుపకుండ చెన్నపట్టణమును ముట్టడించెనని కర్ణాటక నవాబగు "అన్వారుద్దీను" తనకు చెన్నపట్టణమును విడచి పెట్టవలెనని యాతని కాజ్ఞాపించెను. కాని డూప్లే యాతని యాజ్ఞను నిరాకరించెను. వెంటనే నవాబు 10,000 సైన్యమును డూప్లేపైకి బంపెను. ఫ్రెంచిసైన్యము మిగుల తయారీ చేయబడినదగుటచే, నవాబు సైన్యమును "సాంథోమి" (St. Thome 1746) వద్ద నోడించెను. ఇందువలన యైరోపాసైనికులు స్వదేశీయులకన్న ధైర్యవంతులనియు స్వదేశ సిపాయీలైరోపావారిచే దరిఫీజు చేయబడినచో వారుగూడ గొప్ప సైనికు లగుదురనియు దేటపడుచున్నది. ఈ యుద్ధములో డూప్లే గెలిచినవెంటనే, తన్ను ఫ్రెంచివా రెందులకిచ్చుటకి బంపిరో మరచిపోయి తన జయమునకు విఱ్ఱవీగుచు, మఱికొన్ని సైన్యములను సమకూర్చుకొని ప్రతిదినమును వారికి గవాతు నేర్పుచుండెను. ఇది మొద లీతడు స్వదేశరాజులను జయించుటయే దన ముఖ్యోద్దేశముగా జేసికొని యందులకై తగినసమయము నెదురుచూచుచుండెను.

ఇంతలో యూరపునందు ఫ్రెంచివారికిని, ఇంగ్లీషువారికిని యుద్ధ



ము ముగిసెను. కనుక యిరువురికిని నిండియాలో జరుగుచున్న యీ మొదటి కర్ణాటక యుద్ధముగూడ 1748 నాటికి ముగిసెను.

## 5. రెండవ కర్ణాటక యుద్ధము

దక్కనుకు దూర్పుననున్న ప్రదేశమునకు కర్ణాటకమని పేరు. దీనికి 'ఆర్కాటు' ముఖ్యపట్టణము. దీనిని బూర్వము 'దోస్తాలీ' యను నవాబొకడు పరిపాలించుచుండెను. ఇత డప్పటికి హైదరాబాదు నవాబగు నైజాముల్ముల్కునకు సామంతుడుగ నుండెను. ఇట్లుండ గొన్ని కారణములచే నీతడు మహారాష్ట్రులచే బట్టువడినప్పుడు నైజాముల్ముల్కు దన కిష్టుడును, దోస్తు ఆలీ కుమారునికి సంరక్షకుండును అగు "అన్వారుద్దీను" అనువానిని 1740 లో గర్ణాటకమునకు నవాబుగ జేసెను.



అప్పటికే నైజాముల్ముల్కు మిక్కిలి ముసలివాడగుటచే 1748 లో జనిపోయెను. అన్వారుద్దీనుయొక్క రక్షకుడగు నీతడు కాలముచేసెనని తెలియగానే సమయమునకై వేచియున్న "చందా సాహేబు" తన మామగారగు దోస్తాలీయొక్క సింహాసనము దనకు రావలసియున్నదని యన్వారుద్దీనుతో వాదించి యతనిపై దాడి వెడలుటకై ఫ్రెంచివారి సహాయమును బొందెను.

ఇది యిట్లుండ హైదరాబాదులో నైజాముల్ముల్కు చనిపోవుటచే గొన్ని కలతలు గలిగెను. నైజాముల్ముల్కుని రెండవ కుమారుడగు 'నాజరుజంగు' మనుమడగు 'ముజఫరుజంగు' రాజ్యమునకై నొకరితో నొకరు పోరాడసాగిరి. ముజఫరుజంగు తన తాతగా రతని కొరకు మరణశాసనపూర్వకముగా రాజ్యమును దఖలుపరచెనని చెప్పదొడగెను. కాని తండ్రి చనిపోయినవెంటనే తన జ్యేష్ఠ సహోదరుడు ఢిల్లీలో నుండుటచే నాజరుజంగు బొక్కసమును స్వాధీనము చేసికొని సేనాధికారుల నందఱిని లోబరచుకొనెను.

నైజాముల్ముల్కు 1713_1748.




ఇట్టిసమయములో ముజఫరుజంగు, 1742 లో బుదుచ్చేరికి ఫ్రెంచి గవర్నరుగావచ్చిన డూప్లేయొక్క సహాయము నొందెను.



వర్తకమునకై మనదేశమునకు వచ్చిన ఫ్రెంచివారిప్పటినుండి రాజ్యసంపాదకులగుచుండిరి. ఇక నాజరుజంగు వైపు ఇంగ్లీషువారు చేరి ఫ్రెంచివారితో యుద్ధముచేయనిచో నిండియాలో డూప్లే వారి నుండ నీయడన్న సంగతి నింగ్లీషువారు బాగుగా నెఱిగిరి. కనుక వారు నాజరుజంగు పక్షము వహించి ఫ్రెంచివారితో బోరాడసాగిరి.

తొలుత డూప్లే చందాసాహేబు లిరువురును దమ సైన్యములను వెంటబెట్టుకొని కర్ణాటక నవాబగు నన్వారుద్దీనుపై దాడివెడలిరి. వీరతనిని "ఆంబూరు" వద్ద 1749 లో జంపివేసిరి. తండ్రి యుద్ధములో జనిపోయినతోడనే నన్వారుద్దీను కొడుకగు "మహమ్మదాలీ" ఆత్మరక్షణార్థమై తిరుచునాపల్లి కోటకు బారిపోయెను.. అప్పుడాత డింగ్లీషువారి సహాయమును గోరగా నింగ్లీషువా రందులకు సమ్మతించిరి.

తరువాత నాజరుజంగు చనిపోవుటచే ఫ్రెంచివారి సహాయముపేక్షించిన ముజఫరుజంగును డూప్లే హైదరాబాదు సింహాసనముపై గూర్చుండబెట్టెను. అతనికి సహాయముగా నొకసేనను 'బుస్సీ' యనువాని యాధిపత్యముక్రింద నచటికి బంపెను. అందుకు బ్రత్యుపకారముగా నతనికి గొంత సొమ్మును, నొక పెద్ద జాగీరును నిచ్చి కృష్ణానది మొదలు దక్షిణమున కన్యాకుమారీ యగ్రమువరకును గల ప్రదేశమున కతనిని గవర్నరుగా జేసెను.

ఇక నిరువంకలవారికిని యుద్ధము ప్రారంభమాయెను. అందు ఇంగ్లీషువారు, మహమ్మదాలీ, నాజరుజంగు యొకవైపునను, రెండవ వైపున చందాసాహేబు, ముజఫరుజంగు, ఫ్రెంచివారును నుండి యుద్ధము చేయసాగిరి.

ఇప్పటికి సుమారు కర్ణాటకమంతయు చందాసాహేబు వశమయ్యెను. కర్ణాటకము నేలుటకు బూర్వము మహమ్మదాలీని బూర్తిగ నోడించుట యతని కావశ్యకమై యుండెను. కనుక చందాసాహేబు ఫ్రెంచివారి సహాయమున మహమ్మదాలీయున్న తిరుచునాపల్లి కోటను ముట్టడించెను. ఇంగ్లీషువారు కొద్దికొద్దిగా సైన్యములను

మహమ్మదాలీ సహాయమునకై పంపుచుండిరి. కాని వీరిని వెంట వెంటనే చందాసాహేబు ఓడించుచుండెను.


క్లైవు.

అప్పు డింగ్లీషువారి కేమియును దోచక తబ్బిబ్బుపడుచుండ, 'సారిపాలిటి దైవమువలె' "రాబర్టు క్లైవు" (Robert Olive) అను నాంగ్లేయ లేఖరి వారికొక సలహా నిచ్చెను. అది యేమనగా 'మన మిపుడు మనకున్న స్వల్ప సైన్యములతో దిరుచునాపల్లికి బోయి శత్రువుల నోడించి మహమ్మదాలీకి సహాయముచేయలేము. చందాసాహేబు యొక్క ముఖ్య పట్టణమగు ఆర్కాటుపుర మిప్పుడు స్వల్పసైన్య మున్నది. కనుక మనమిపు డార్కాటును ముట్టడించితిమేని తిరుచునాపల్లిలోనున్న కొంత సైన్యమును చందాసాహేబు మనమీదికి బంపును. అప్పుడు మహమ్మదాలీ నతిసులభముగ విడిపించి చందాసాహేబును జంపగలము'. ఇతని తెలివికి మెచ్చి, చెన్నపురి గవర్నరొక సైన్యముతో నితని నార్కాటు పైకి బంపెను. ఇంతలో నీసంగతి చందాసాహేబునకు దెలిసెను. వెంటనే తన కుమారుడగు 'రాజాసాహేబు' ను గొంత సైన్యముతో నార్కాటునకు బంపెను. సుమారు రెండు మాసములు ఆర్కాటు ముట్టడి జరిగెను. భోజనసామగ్రి లేకుండుటచేతను. తన సైన్యములు మిగుల స్వల్పముగా నుండుటచేతను, క్లైవు వెంటనే రాజాసాహేబు నెదిరింపలేకపోయెను. ఇంతలో మదరాసు గవర్నరు తన సహాయమునకై కొన్ని సైన్యములను బంపుటచే, రాజాసాహేబును 'ఆర్నీ'



(Arni) వద్ద 1751 లో బూర్తిగా నోడించెను. దీనిమూలమున క్లైవు యొక్క ప్రఖ్యాతి నలుదిక్కుల వ్యాపించెను.

తరువాత 'క్లైవు' 'మేజరు లారెన్సు' వీరిద్దఱు నొక సేనతో దిరుచునాపల్లికి జనిరి. ఇంతలో తంజావూరు రాజు వీరి సహాయమునకై సైన్యమొకదానిని బంపెను. వారందఱును గలిసి తిరుచునాపల్లికి వచ్చుచున్నారని తెలిసి, శత్రుసైన్యములు కావేరీ నదీతీరమందున్న శ్రీరంగమునకు 1752 లో బారిపోయెను. తరువాత చందాసాహేబు తంజావూరి రాజు శరణుజొచ్చెను. కాని తొలుత యతడు శరణమిచ్చి తుదకు చందాసాహేబును జంపించెను.

పిదప, ఇంగ్లీషువారు తిరుచునాపల్లిలోనున్న ఫ్రెంచి సైన్యములను దరిమివేసి. కోటలోనున్న మహమ్మదాలీని ఆర్కాటు నవాబుగా జేయుటకై తిరుచునాపల్లికి బోయిరి. తిరుచునాపల్లి కర్ణాటక మనెడి పెట్టెకి తాళమువలె నున్నది. ఇది కావేరీ తీరమందుండెడి ముఖ్య పట్టణములలో మిగుల ప్రసిద్ధికెక్కినది. ఇందొక కొండపై గట్టబడిన గొప్పకోట యొకటి కలదు. అందునే మహమ్మదాలీ యింతవరకు నుండెను. దీని రక్షకులు తమ తమ బలములను సురక్షితముగ నుంచుకొని శత్రుసైన్యములను నగటున బరీక్షించి పోరాడుట కిది యత్యనుకూలముగ నున్నది. ఇది మిగుల యున్నతస్థలమున నుండుటచే దీనిని ముట్టడించుట శత్రువులకు దుస్సాధ్యము. ఇందుచే దీనికి ప్రాముఖ్యత హెచ్చుగనుండెను. ఇంగ్లీషువారు, ఫ్రెంచివారును నొకరితో నొకరు బోరాడిరిగాని తుదకు 1755 లో పుదుచ్చేరివద్ద విరుపురికిని సంధి జరిగెను. ఇందువలన మహమ్మదాలీని నింగ్లీషువారు కర్ణాటక నవాబుగ జేసిరి. హైదరాబాదునందు మాత్రము ఫ్రెంచివారి యధికారము తగ్గలేదు. వీరికి ముజఫరుజంగు కాలముచేసిన తరువాత వచ్చిన నవాబగు సలబత్ జంగు ఉత్తర సర్కారులనుండి వచ్చెడి రాబడి నిచ్చెను. ఇంతతో రెండవ కర్ణాటక యుద్ధము ముగిసెను. (1748-'55)

## 6. ఫ్రెంచివా రోడుట

ఫ్రెంచివారు కేవలము డూప్లేయొక్క ప్రోత్సాహముచేతనే రెండవ కర్ణాటకయుద్ధమునకు సిద్ధపడిరి. కాని ముందు మీరు చదువబోయెడి కొన్ని కారణములచే నెల్లప్పుడును డూప్లే యింగ్లీషువారిచే నోడింపబడుచుండెను. అందుచే నితనిపై ఫ్రెంచిప్రభుత్వమువారి కసూయగలిగెను. కనుక వారతనిని గవర్నరు పదవినుండి తొలగించి మఱియొకనిని నాతని యాస్థానమున నియమించిరి. 1758 అగుసరికి "కౌంటు-డి-లాలీ" యనువానిని పుదుచ్చేరి గవర్నరుగా నియమించిరి. ఇతడు ముక్కోపి, పట్టినపట్టు విడువడు. ఇతరుల సలహా నించుకైనను గమనింపడు.

ఇట్టిసమయములో నింగ్లీషువారికి, ఫ్రెంచివారికి 1756 మొదలు 1763 వరకు నైరోపాఖండమందు యుద్ధము జరుగుచుండెను. (The Seven years' War in Europe) తొలుత లాలీ, సెంటు డేవిడ్ కోటను ముట్టడించెనుగాని పూర్తిగా నాశనము చేయలేకపోయెను. తరువాత, మదరాసును ముట్టడింపదలచి, లాలీ హైదరాబాదులో నున్న బుస్సీని వెంటనే తన సహాయమునకు రమ్మని యుత్తరవు జేసెను. కాని సుబుద్ధియగు బుస్సీ, తానచ్చటనుండి వచ్చు క్షణముననే యింగ్లీషువారు హైదరాబాదును స్వాధీనము చేసికొందురని యుత్తరము వ్రాసి పంపెను. కాని మిక్కిలి మూర్ఖుడగు లాలీ వెంటనే రమ్మని యాతనికి గబురంపగా నతడట్లే చేయవలసివచ్చెను. వెంటనే బుస్సీ చెప్పినచొప్పున, ఫ్రెంచివా రాధిక్యత హైదరాబాదులో క్షీణింపదొడగెను. విజయరామరాజుగారు (Maharajah of Vizianagram in Vizag Dt.) హైదరాబాదులో బుస్సీ తరువాత వచ్చినవానితో దెబ్బలాడి కలకత్తాలోనున్న క్లైవు సహాయముబొందెను. క్లైవు కర్నల్ ఫోర్డు అనువానిని ఉత్తరసర్కారులకు బంపగా నతడు ఫ్రెంచివారి నచటనుండి తగిలివేసెను.



లాలీ మదరాసును బట్టుకొన బ్రయత్నించెనుగాని యింగ్లీషువారికి సైన్యము, నౌకాబలము హెచ్చుగనుండుటచే భూమిమీదుగను, సముద్రముమీదుగను గూడ సామగ్రి కోటలోనికి వారికి వచ్చుచుండెను. ఇంతలో నుభయకక్షులవారికిని బోరు ఘోరమయ్యెను. లాలీ తా నోడిపోయి చంపబడెద నేమోయని భీతిజెంది బుస్సీ వచ్చుచున్న సంగతి దెలిసియున్నప్పటికి బుదుచ్చేరికి బారిపోవుచుండెను.

సమయ మిదియే యని యప్పటికి బంగాళములోనున్న క్లైవు ఉత్తరసర్కారులను (అనగా గంజాము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణజిల్లాలు) స్వాధీనముచేసికొనుటకై 'కర్నల్ ఫోర్డు' ను గొంత సైన్యముతో బంపెను. ఈసైన్యము మచిలీపట్టణమును ముట్టడించి స్వాధీనము చేసికొనుచుండగా, హైదరాబాదు నవాబు ఫ్రెంచివారి క్షీణదశను జూచి క్రీ. వె. 1759 లో నుత్తరసర్కారుల నింగ్లీషువారి కిచ్చి, వారితో స్నేహము చేసికొనెను

కౌంటు-డి-లాలీ పుదుచ్చేరికి బారిపోవుచుండ మార్గమధ్యమున "వందవాసి" (Wandiwash) వద్ద 1760 లో నింగ్లీషువా రతనిని బూర్తిగ నోడించిరి. కనుక నిత డిండియాలో బాదము పెట్టినది మొదలు చనిపోవువరకును ఫ్రెంచివారికపజయములేతప్ప జయమన్న మాట లేకుండెను.

ఫ్రెంచి ప్రభుత్వ నాశనమున కీతడే కారకుడని చెప్పుటకు వీలు గలదు. ఇతడు తానుపట్టిన పట్టు విడువక, ఇతరులుచెప్పిన సలహాలను జెడచెవిని బెట్టి, బుస్సీని, హైదరాబాదునుండి రప్పించి, తుద కాతడు వచ్చుసరికి మదరాసు ముట్టడిని వదలి, పుదుచ్చేరికి బోయి హైదరాబాదులోనున్న ఫ్రెంచిప్రభుత్వ మూరీతిని నాశనము జేసెను. ఫ్రెంచివా రోడుట కింకను గొన్ని కారణములు గలవు. వీరికి సమయమునకు గావలసినంత సొమ్ము ఫ్రాన్సుదేశమునుండి వచ్చుటలేదు. ఇంతియు గాక, వీరు చేయవలసిన పనిని తిన్నగా జేయకుండిరి. అనగా వీరు తొలుత మనదేశమునకు వర్తకమునకై వచ్చి, ఆయుద్దేశమును మరచి

పోయి యొక యుద్ధములో గెలిచినంత మాత్రమున విఱ్ఱవీగుచు స్వదేశ రాజుల నోడించుటయే వారు తమ ముఖ్యోద్దేశముగా బెట్టుకొనిరి. డూప్లేయొక్క దురాశకూడను గొంతమట్టుకు వీరి ప్రభుత్వమును నాశనముచేసెను. డూప్లేను గవర్నరు పదవినుండి తొలగించినతరువాత, ఫ్రెంచివారికి దెలివితేటలలో దమ శత్రువులగు నింగ్లీషు సేనానాయకుండగు క్లైవుతో సమానుడు లేకపోయెను. ఇంతియేగాక ఇంగ్లీషువారి కున్నంత నౌకాబలము ఫ్రెంచివారికి లేకుండుటచే ఫ్రెంచివారి ప్రభుత్వము మన దేశమునందు 1763 నాటికి క్షీణింపసాగెను.

కర్ణాటక యుద్ధములను దెల్పు పటము.—






ఇంగ్లీషువారికి కర్ణాటక యుద్ధములవలన గలిగిన ఫలిత మేమి? ఫలితము లన్నిటిలోను మొదటి దింగ్లీషువారు తమ ప్రభుత్వమును గర్ణాటకములో స్థిరపరచుకొనుటయే. రెండవది వీరు హైదరాబాదు నవాబు స్నేహమును సంపాదించి, యతనియొద్దనుండి యుత్తర సర్కారులను గైకొనుటయే.

## —♦ 7. బంగాళము నింగ్లీషువారు సంపాదించుట ♦—

ఇంతవరకు మీరు దక్షిణ యిండియాయొక్క స్థితినిగూర్చి నేర్చుకొంటిరి. మీరిక ఉత్తర హిందూస్థానపు జరిత్రను నేర్చుకొనవలసియున్నది సుమారు క్రీ. వె. 1740 సంవత్సరమునకు "అలివర్దీఖాను" యను నతడు బంగాళము నేలుచుండెను. ఇతడు మిగుల కఠినుడగుటచే బంగాళములోనున్న యింగ్లీషు వర్తకులపై నధికముగా బన్ను విధించుచుండెను. ఆ కాలమున నింగ్లీషువారు కలకత్తా, కాసీంబజారు, డక్కా, పాట్నాల, బాలసూరులలో వర్తకము చేయుచుండిరి.

ఇట్లుండ నీతడు 1756 లో జనిపోయెను. వెంటనే యితని మనుమడగు 'సురాజి దౌలా' రాజ్యమునకు వచ్చెను. ఇతడు చిన్నతనమునుండియు మిగుల గారాబముగా బెరుగుటచే నితనికి బెక్కు దుర్గుణము లబ్బెను. కనుక ప్రజ లతని ద్వేషించుచుండిరి. ఇతడు జ్ఞానవిహీనుడై మహా క్రూరుడుగను, త్రాగుబోతుగను, భట్రాజుల బొగడ్తలకు లోబడినవాడుగ నుండెను. ఇత డింగ్లీషువారిపై మిగుల ద్వేషము వహించియుండెను. ఏలయనగా వీ రిదివర కొక స్వదేశ రాజును దొలగించి మఱియొకనిని సింహాసనమున గూర్చుండబెట్టి, అందువలన వీరు గొంతసొమ్మును వానివద్దనుండి గైకొన్న సంగతి మొదలగువానిని సూరాజి దౌలావిని తన్నుగూడ నెప్పుడైనను సింహాసనమునుండి తొలగించెదరేమో యని భయముచే వారిని ద్వేషించుచుండెను. ఇతడొక గొప్ప త్రాగుబోతగుటచే నెంత రాబడి తనకు

వచ్చినను జాలక బంగాళములోనున్న యింగ్లీషు వర్తకుల సరకులపై నధికముగా బన్నులు విధించుచుండెను.

ఇంతలో 1756 లో నింగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని యుద్ధప్రారంభము గాగానే యింగ్లీషు నాయకుండగు 'డ్రేకు' కలకత్తాలో నున్న ఫోర్టు విలియమును మరమ్మత్తు జేయించుచుండెను. నవాబునకిది యెంతమాత్రమిష్టము లేదు. ఇట్టిసమయమున దాను మరుసటి దివమున దోపిడిచేయ నిశ్చయించె నన్నసంగతి యొక గొప్ప భాగ్యవంతుడు గ్రహించి వెంటనే డ్రేకువద్దకు బోయి శరణుజొచ్చెను. ఇదివరకే యింగ్లీషువారియెడల ద్వేషము వహించియుండిన సురాజిదౌలాకు కోప మధికమయ్యెను. అందుచే నతడు డ్రేకువద్ద శరణుజొచ్చి వానిని విడిచిపెట్టవలసినదనియు, డ్రేకున కుత్తరము వ్రాయగా నత డందులకు నిరాకరించెను.

తక్షణమే సురాజిదౌలా యింగ్లీషు వర్తకస్థలమగు "కాసీంబజారు" ను ముట్టడించెను. ఇంగ్లీషువారిని కొందఱిని ఖైదీలుగ దీసికొనెను. తరువాత 50,000 సైన్యముతో కలకత్తానగరమును ముట్టడించెను. ఈసంగతి కొంచెము ముందుగా నింగ్లీషువారికి దెలియుటచే, స్త్రీ పురుషాదులు కొందఱు హుగ్లీనదిమీదుగ బారిపోయిరి. నవాబు కలకత్తాను బట్టుకొని యచ్చట మిగిలియుండిన యింగ్లీషువారి నందఱిని ఖైదీలుగ దీసికొనెను. వీరిని తన సైన్యాధికారుల కప్పగించి, తాను పోయెను. సూర్యాస్తమయము కాగానే వారు యింగ్లీషు సైనికులను 146 గురిని 18 చ. అ. వైశాల్యముగల గదిలోబెట్టి తాళము వేసిరి. ఈగదికే కలకత్తా చీకటిగది యని పేరు. (1756) (The Black Hole of Calcutta.) మరునా డుదయమున దలుపులు దీసి చూడ 123 రు చనిపోయిరి. మిగిలినవారికి కొనప్రాణములు మాత్రము గలవు. (ఇప్పుడు కొందరు చరిత్రకారులు ఈ చీకటిగది కథ నమ్మదగినదికాదని చెప్పుచున్నారు.)

ఈ హత్యసంగతి మదరాసులోనున్న యింగ్లీషు వారికి దెలియ



వచ్చెను. వీరు కోపోద్రిక్తులై వెంటనే క్లైవును నేలమీదుగను, "వాట్సన్"ను సముద్రముమీదుగను హుగ్లీపట్టణమునకు దమ సైన్యములతో బంపిరి. నవాబునకీసంగతి దెలియగానే వారితో సంధి కొడంబడెను. కాని కొద్దికాలములోనే యతడుత్తరసర్కారులలోనున్న బుస్సీ సహాయమును బొంది వీరితో యుద్ధము చేయుటకు బ్రయత్నించెను. ఈసంగతి క్లైవునకు దెలిసినతోడనే చంద్రనగరమును, కాసీంబజారును ముట్టడించి భాగీరథీతీరమందున్న "ప్లాసీ" యను గ్రామమున నవాబు నెదుర్కొన నిశ్చయించెను.

ప్లాసీయుద్ధమును దెల్పు పటము.



క్లైవింత త్వరగా నవాబును ప్లాసీగ్రామమువద్ద నెదుర్కొన నిశ్చయించుటకు గొన్ని కారణములు గలవు. ఇందుకు ముఖ్యకారణము నవాబుపై బ్రజలకు గల ద్వేషమే. నవాబు మంత్రి యగు "రాజారైదుర్లాబ్", సైన్యాధిపతియగు "మీర్జాఫరు", కోశీదారుడగు (Banker) "జగత్ సెత్" మున్నగువారతనిపై గుట్రలు పన్నుచుండిరి. ఇట్టిసమయమునకై వేచియున్న క్లైవునకిది యత్యనుకూలముగ నుండెను. కనుక వెంటనే క్లైవు నవాబుయొక్క సైన్యాధిపతియగు మీర్జాఫరుతో నాతనిని నవాబుగ జేయుటకును, నాతడు తనతో ప్లాసీయుద్ధములో గలియుటకును, సంధిని రహస్యముగ జేసికొనెను.

1757 సంవత్సరము జూను 23 తేదీని నవాబు సైన్యముల నింగ్లీషువారు ప్లాసీ గ్రామమువద్ద నెదుర్కొనిరి. (ప్లాసీ యుద్ధపు పటమును జూడుడు.) ఇంగ్లీషువారి సైన్యములు చాల తక్కువైనను చివరకు వారే జయమునొందిరి. ఇందుకు గారణమేమనగా, సైన్యాధిపతియును, రాజద్రోహియును యగు మీర్జాఫరు ముందు క్లైవునకు జేసిన వాగ్దానముచొప్పున యుద్ధము జరుగుచున్నప్పుడు తన సైన్యముతో గొద్దిగ దూరమున నిలువబడి నవాబును యుద్ధభూమినుండి పారిపోవునటుల జేసెను. అందుచే త్వరలో సురాజిదౌలాయొక్క సైన్యములు చెల్లాచెదరై పోయెను. నవాబు ఆత్మరక్షణార్థమై "రాజమహాల్"నకు బారిపోయెను. ఈసంగతిని దెలిసికొని మీర్జాఫ రతనిని జంపించెను.

కనుక ప్లాసీయుద్ధమునం దింగ్లీషువారు పూర్ణవిజయులైరి. ఇట్లు వీరు సంపూర్ణముగా జయము నొందుటకు గొన్ని కారణములు గలవు. ఇందుకు రాజద్రోహియగు మీర్జాఫ రింగ్లీషువారితో గలయుటయే ముఖ్యకారణము. ఇంతేగాక, ఇంగ్లీషు సైన్యాధిపతి యగు క్లైవుయొక్క శక్తి సామర్థ్యము, అతని బుద్ధి కుశలత, యుద్ధతంత్రములుగూడను గొంతమట్టు కింగ్లీషువారి జయమునకు దోడ్పడెను. మఱియు నింగ్లీషువారికి దమ నౌకాబలముతో గంగానదీముఖద్వారములగుండా భాగీరథీ నదిలోనికి సులభముగా దీసికొనిపోవుటకు శక్తియుగూడ గలదు. ఇంతేగాక నవాబుపై బ్రజలకు మిగుల ద్వేషముగ నుండెను. కనుకనే నవాబోడుటయు, నింగ్లీషువారు జయమునొందుటయు దటస్థించెను.



ఈ యుద్ధమువలన బంగాళ రాజ్యమంతయు నింగ్లీషువారి స్వాధీనమాయెను. సంధిప్రకారము మీర్జాఫ రింగ్లీషువారికి యుద్ధములో సహాయముచేయుటచే క్లైవాతనిని బంగాళమునకు నవాబుగ జేసెను. ఇందుకు బ్రత్యుపకారముగ మీర్జాఫ రింగ్లీషువారికి గలకత్తాకు సమీపమందున్న 24 పరగణాలును, కోరిన బహుమతులును నిచ్చెను. ఈ పరగణాలనే "క్లైవు జాఘీరు" అని యందురు. పేరునకు నవాబుండెనుగాని నిజముగా నింగ్లీషువారే బంగాళము, బీహారు, ఒరిస్సాలను బాలింపసాగిరి.

ఈయుద్ధము పూర్వపు యుద్ధములవలెగాక కొన్ని విషయములలో మారియున్నది. పూర్వమిండియాను జయించినవారందరు ఆఫ్ఘనిస్థానము, బెలూచిస్థానములగుండా ఇండియాను జయించుచుండిరి. ఇందుకుదాహరణముగ ఆర్యులు, మహమ్మదీయులు యిండియాను 'బోలాన్' 'కైబరు' త్రోవలు మున్నగువానిగుండ వచ్చి, ఇండియాను జయించినటుల మీ రిదివరకే చదివియున్నారు. వారటులా నేలమీదుగా వచ్చి యెన్నెన్నియో కష్టములను జెందుచుండిరి. కాని యిప్పుడు బంగాళమును జయించిన మన యింగ్లీషువారికి హెచ్చుగా నౌకాబల ముండుటచేతను, గంగానదీ ముఖద్వారములు మిగుల విశాలముగ నుండుటచేతను, వీరు తమ యోడలతో బంగాళములోని కతి సులభముగా వచ్చి యద్దాని (బంగాళమును) నాక్రమించుకొన గలిగిరి.

## 8. బంగాళముస్థితి (క్రీ. వె. 1760 మొదలు 1770 వరకు.)

ముందుపాఠములో బంగాళమును ప్లాసీ యుద్ధమైన తరువాత మీర్జాఫ రేలినచుండినటుల మీరు చదివియున్నారుగదా! పేరున కీతడు నవాబుగ నుండెనుగాని నిజముగా నిత డింగ్లీషువారియొక్క చేతి బొమ్మగనే. విశేష సామర్థ్యము లేనివా డగుటచే నితడు వా రెటుల జెప్పిన నటుల నడుచుకొనవలసి యుండెను. ప్లాసీ యుద్ధమైన తరువాత నింగ్లీషువారు తమ సేనలను గొన్నిటిని బంగాళములో మీర్జాఫరు రక్షణకొఱకై యుంచిరి. కాని, ప్రతిదినమును వాని కగు ఖర్చు అంతయు నితడే పెట్టుకొనవలసి యుండెను. తనకు వచ్చు రాబడిలో చాలభాగము దీనిక్రిందనే వ్యయమగుచుండెను. ఇతడు కంపెనీవారి కివ్వవలసిన బాకీ తీరుమానమునిమిత్తము గొంతసొమ్ము వెచ్చించుచుండెను

ప్రతి కంపెనీ యుద్యోగస్థుడు నితనిని మిగుల కష్టపెట్టుచుండెను. ఒక్కొక్క డీతనిపాలిటి శనిగానివలె దాపరించి చిక్కులు పెట్టుచుండిరి. వీరు తన పరిపాలనా పద్ధతి బాగులేదని కంపెనీవారికి జెప్పి యెప్పుడు తొలిగింపజేయుదురో యని భయము నొందుచుండెను. వారికి సదా బహుమానము లిచ్చుచు దన బొక్కసములో నున్న ధనము నంతయు వెచ్చించుచుండెను. కంపెనీ యుద్యోగస్థులు, తాము బాగుగా వర్తకము జరిగింపలేదని ఇంగ్లాండులోనున్న డైరెక్టర్లకు కోపము వచ్చునేమోయని యెంచి, బస్తా 1 కి 25 రూపాయీల కిచ్చెడి సామగ్రి నిరువది రూపాయీలకే కొన్నటుల వ్రాసి పంపుచుండిరి. ఇందువలన డైరెక్టర్లు వీరు బాగుగా వర్తకము జరిగించుచున్నారని యనుకొనుచుండిరి. కాని నిజముగా నందుకు దగులుబడి యగు సొమ్ము యేవత్తును, వీరు నవాబువద్దనుండి కైకొనుచుండిరి. ఇట్టి పట్టుంబులను బెట్టుకొనెడి నవాబునకు ధన మెచ్చట యుండును? అందులకై నవాబు (మీర్జాఫరు) ప్రజలపైని నితర వర్తకస్థులపైని



హెచ్చుగ బన్నులను విధించుచుండెను. అట్టివానిని జెల్లింపజాలని వారల నితడు మిగుల హింసించుచుండెను.

ఇది యిట్లుండ కంపెనీ యుద్యోగస్థుల జీతములు బహు స్వల్పముగా నుండెను. గనుక వీరు వ్యవసాయదారులను, భాగ్యవంతులను పీడింపసాగిరి. అప్పటికైనను వారి యాశయంత మణకపోవుటచే స్వలాభమునకై వారు స్వంతముగా వర్తకము చేయదొడగిరి. ఇట్టి సమయములో "అగ్నికి గాలి సహాయమ" గునటుల నిట్టి యరాజకమునకు వాన లేమికూడ దోడ్పడెను. కనుక 1760 మొదలు 1770 వరకు బంగాళములో గొప్ప క్షామముగ నుండెను.

ఇట్లుండ మీర్జాఫరు కంపెనీవారి కివ్వవలసిన సొమ్మునాళ్ళకైన నివ్వజాలకపోయెను. ఇంతేగాక తన రాజ్యమందున్న యరాజకములను జూచి మిగుల దుఃఖించి యదియంతయు కంపెనీవారికి దాను లోబడియుండుటవలననే గలిగెనని తలచెను. కనుక మీర్జాఫరు స్వాతంత్ర్యమును సంపాదింప బ్రయత్నించి బంగాళములోనున్న యింగ్లీషు వారిని దఱిమివేయవలెనని యుద్దేసించెను. అందులకు డచ్చివారి సహాయమును బొంద బ్రయత్నించెను.

ఈసంగతి తెలిసినవెంటనే యింగ్లీషువా రితనిని సింహాసనము నుండి తొలగించి యితని మేనల్లుడగు "మీర్కాసీమ్" ను 1761 లో నవాబుగ జేసిరి. ఇందుల కితడు ప్రత్యుపకారముగా నింగ్లీషువారికి బర్ద్వాన్, మిడ్నపూర్, చిట్టగాంగ్ అనెడి మూడుజిల్లాల నిచ్చెను. ఇతడు తన మేనమామవలె గాక యింగ్లీషువారికి లోబడియుండ లేదు. సమీపమందున్నచో దన యూహలన్నియు బైటబడునని "మాంఘీరు" నితడు తన ముఖ్యపట్టణముగా జేసుకొనెను. వ్యాపార విషయమందు గూడ కంపెనీవారికి వ్యతిరిక్తముగానే యీతడు నడుచుచుండెను. ఇందు కింగ్లీషువా రితనిపై గోపమును జెంది యితనిని సింహాసన

భ్రష్టునిగ జేసి తిరుగ మీర్జాఫరును నవాబుగ జేసిరి.

కనుక మీర్ఖాసీమ్ కోపమునుజెంది 1763 లో పాట్నావద్ద రెండువందల యింగ్లీషువారిని జిత్రవధ గావించెను. ఈసంగతి తెలిసిన తోడనే యింగ్లీషువారు మీర్ఖాసీమ్‌ను యుద్ధములో నోడించిరి. అప్పు డతడు యయోధ్య నవాబువద్దకు బారిపోయెను. అచ్చట ఢిల్లీ చక్రవర్తి యగు 'షహాలం' అయోధ్య నవాబగు 'షూజా ఉద్దౌలా' యనువారి సహాయమును బొంద 1764 లో 'బక్సారు' వద్ద నింగ్లీషువారి నెదిరించెను. కాని తుద కింగ్లీషువారే జయము నొందిరి. ఈ యుద్ధమువలన నింగ్లీషువారు బంగాళము, బీహార్, ఒరిస్సాలకు సార్వభౌములైరి. సాలీనా 26 లక్షల రూపాయీలను గప్పముగ గణించిరి.

ఇంతలో వందవాసి యుద్ధమైనతరువాత ఇంగ్లాండునకు బోయిన క్లైవును దిరుగ 1765 లో నింగ్లీషువారు బంగాళములో నప్పటికియున్న యరాజకమును బాపుటకై పంపిరి. క్లైవు రెండవసారి యిండియాకు వచ్చుట యిదియే. ఇతడు బంగాళమునకు వచ్చుసరికి, మీర్జాఫరు చని పోవుటచే, నతని కుమారుని నవాబుగ జేసెను. అందుల కాతడు 14 లక్షల రూపాయీలను గంపెనీవారికి బహుమానముగ నిప్పించెను.

లార్డు క్లైవు బంగాళమునకు గవర్నరుగా నిప్పుడువచ్చి పరిపాల నాపద్ధతులలో గొన్ని మార్పులను గలిగించెను. కంపెనీ యుద్యోగస్థులు తమ స్వలాభమునకై యెట్టి వ్యాపారమును జేయగూడదనియు, స్వదేశరాజులవద్ద లంచములుగాని, బహుమానములుగాని పుచ్చుకొన గూడదనియు నాజ్ఞాపించెను. సంఘపు టుద్యోగస్థుల జీతములను హెచ్చించెను. తరువాత, సిపాయీ లింతవరకు యుద్ధసమయమున బొందుచున్న రెట్టింపు బత్తెమును తగ్గించెను.



క్లైవు బక్సారు యుద్ధములో నయోధ్య నవాబు నోడించెనని విర్రవీగక యతనితో నొక యొడంబడికను జేసుకొనెను. దీనివలన నింగ్లీషువారు కోరా, అలహాబాదులను దీసికొనుటయేగాక ప్రతి సంవత్సరమును 26 లక్షల రూపాయీలను గూడ నవాబువద్ద గైకొను చుండిరి. తుదకు నవాబు వీరికి ముఖ్యస్నేహితు డయ్యెను. ఢిల్లీ చక్రవర్తియగు షాహాలం ఇంగ్లీషువారికి బంగాళము, బీహారు, ఒరిస్సాల లోని శిస్తులు హెచ్చించుట, వాటిని వసూలుచేసికొనుట మొదలగు స్వాతంత్ర్యాధికారము నొసంగెను. (దివాన్ గిరీ) ఇందువలన నవాబునకు సివిల్ క్రిమినల్ వ్యవహారములలోను, పోలీసువారిపైని యధికారము గలిగెను. కంపెనీవారు పన్నులను వసూలుచేసి నవాబునకును, అతని ఉద్యోగస్థులకును జీతముల నిచ్చుచుండిరి. చక్రవర్తికి కోరా, అలహాబాదు అనెడి జిల్లాలనిచ్చి, సాలీనా 26 లక్షల రూపాయీలను గప్పము కట్టుటకు క్లైవు వొప్పుకొనెను. తరువాత 1767 లో క్లైవు ఇంగ్లాండునకు బోయి 1774 లో గొన్ని కారణములచే నాత్మహత్యను గావించుకొనెను.

ఇత డింగ్లాండునకు బోయిన నాలుగేండ్లలోనే, ఇంగ్లీషువారి దివాన్‌గిరీవల్ల జనులబాధలు హెచ్చసాగెను. ఈసంగతి యింగ్లాండులోనున్న కంపెనీ డైరెక్టర్లకు దెలిసి, కంపెనీ ప్రభుత్వమును బాగుచేయుటకును, దేశక్షామమును బాపుటకును 1772 లో "వారన్ హేస్టింగ్సు" అనువానిని బంగాళమునకు గవర్నరుగా బంపిరి.

ఇట్టిసమయమున శిక్కులనెడి జాతివారి సంఘబలము చేతను, బలిష్టులగు ప్రభువులు అఫ్ఘనిస్థానము నేలుచుండుటచేతను, మన దేశమునకు బాహ్యమునుండియు దండయాత్రలవలన గలుగుచుండెడి బాధతప్పి, దేశమందు స్వస్థత గలిగెను.

## 9. వారన్ హేస్టింగ్సు (క్రీ. శ. 1772_1785.)



వారన్ హేస్టింగ్సు.

ఇతడు 1732 లో బుట్టి తన పదునెనిమిదవ యేట హిందూదేశమునకు దొలుత వచ్చెను. ఇతడు క్లైవువలె మిగుల తెలివితేటలు గలవాడై తన చిన్నతనమునందే ఈస్టిండియా కంపెనీవారి యుద్యోగమున జేరెను. కొద్దికాలములో నితనిని కలకత్తానుండి కాసింబజారునకు మార్చిరి. తరువాత నితడు కౌన్సిలు మెంబరుగా నుండి హిందీ, పార్సీ భాషల నభ్యసించి, 1764 లో నింగ్లాండునకు బోయెను.

1772 లో నితడు బంగాళమునకు గవర్నరుగా నియమింపబడెను. ఇతడు క్లైవువలె మంచి బుద్ధికుశలత గలవాడగుటచే రాజ్యాంగ పద్ధతులను బహునేర్పుతో సవరించెను. పన్నులు వసూలుచేయుట యందును, న్యాయవిచారణ మున్నగువానియందును ఎన్నియో సంస్కరణములు చేయవలసియుండెను.

బంగాళములో రివిన్యూ వసూలుచేయుట కంపెనీవారిదైనను నవాబుయొక్క యధికారులే పన్ను వసూలుచేయుచుండిరి. వీరు కంపెనీవారికి జెందవలసిన మొత్తమంతయు గట్టక వారిచ్చవచ్చినటుల నక్రమములను జేయసాగిరి. కావున కంపెనీవారికి సొమ్మెంత వచ్చుచున్నదో తెలియకుండెను. అందులకై వారన్ హేస్టింగ్సు ద్వంద్వ ప్రభుత్వమును మాన్పెను. ఇంగ్లీషువారి నేకఛత్రాధిపతులుగ జేసెను. దేశము ననేకజిల్లాలుగ భాగించి యొక్కొక్క జిల్లా కొక్కొక్క



యూరోపియన్ కలక్టరును నియమించెను. ఇతడు పన్నులను వసూలు చేయుటయేగాక సివిల్, క్రిమినల్ కేసులను విచారణగూడ జేయుట కలదు. పన్ను వసూళ్ళను బరీక్షించెడి రివెన్యూబోర్డు నొకదానినిగూడ స్థాపించెను.

న్యాయవిచారణ నిమిత్త మితడు సివిల్ (Sadr Dewani Adalat) క్రిమినల్ (Sadr Nizamati Adalat) అను అప్పీలు కోర్టులను రెండింటిని కలకత్తాలో స్థాపించెను. మనుశాస్త్రమును దెలిసిన హిందూ పండితులును, ఖురాను దెలిసిన మహమ్మదీయ పండితులను న్యాయవిచారణకై యావశ్యకమగు చట్టముల నేర్పరుపగలందులకు నియమించెను.

జనుల రక్షణార్థమై పోలీసువారిని దృఢపరచి బందిపోటు మున్నగునవి కొంతవరకు మాన్పెను. ఇంతేగాక ప్రజ లిచ్చుకోనలేని కొన్ని పన్నులనుగూడ తగ్గించెను. అలహాబాదు, కోరా జిల్లాలను లాగుకొని వాని నయోధ్య నవాబున కేబదిలక్షల రూపాయిలకమ్మెను. ఢిల్లీ చక్రవర్తి కిచ్చుచున్న 26 లక్షల రూపాయిలను నిచ్చుట నిలుపు చేసెను. ఈప్రకారము కంపెనీవారికి లాభముగలిగించి ప్రజలను మిగుల సౌఖ్యపెట్టెను.

## వారన్ హేస్టింగ్సు గవర్నరుజనర లగుట (క్రీ. శ. 1774_1785.)

ఇంగ్లండ క్రీ. శ. 1773 లో నింగ్లీషు పార్లమెంటువారు బంగాళములో నున్న కంపెనీ యుద్యోగస్థుల పెద్ద ప్రభుత్వమును బాపుటకై "రెగ్యులేటింగు ఆక్టు" అనెడి చట్టము నొకదాని నేర్పరచిరి.

దీనిప్రకారము బంగాళదేశమునకు గవర్నరు జనరల్ అనెడి క్రొత్త యధికారుని నియమించిరి. కనుక యిందువలన నప్పటి బంగాళపు గవర్నరగు వారన్ హేస్టింగ్సు గవర్నరు జనరలయ్యెను. ఇతని క్రిందటి పై నధికారము గలిగియుండినను, తన యిష్టానుసారముగ నేలుటకు

వీలు లేకుండెను. ఇతనికి సలహానిచ్చుటకై నలుగురు సభ్యులు నియమింపబడిరి. ఈసభవారిలో నెక్కువమంది యేలాగున దీర్పుజేసిన నాలాగున నితడు చేయవలయునని యేర్పాటు చేయబడెను. న్యాయవిచారణకై కలకత్తాలో నొక ప్రధాన న్యాయస్థానము (Supreme Court) ఒకటి స్థాపింపబడెను. ఇంతియగాక చెన్నపట్టణము, బొంబాయి గవర్నరులు, గవర్నరు జనరలునకును, నతని యాలోచన సభవారికిని, లోబడి నడుచుకొనవలసి యుండెను. ఎవరితోనైనను సంధిగాని, యుద్ధముగాని వీరు గవర్నరు జనరలుయొక్క యనుజ్ఞలేక చేయరాదు. కంపెనీ యుద్యోగస్థులు తమ స్వలాభమునకై యెట్టి వర్తకమును జేయగూడదనియు, బహుమానములు గైకొనగూడదనియు, ఆక్టులో విధించబడియున్నవి.

ఈచట్టమువలన 1774 లో వారన్ హేస్టింగ్సు గవర్నరు జనరలాయెను. దీనివలన నితని కష్టములు హెచ్చసాగెను. ఏలయన దన యాలోచన సభవారిలో ముఖ్యుడగు 'ఫిలిప్ ఫ్రాన్సిస్' అను నతడును మఱి యిద్దరును గలసి యితనిమాట పడనీయక యితని ననేకవిధముల గష్టములలో దించుచుండిరి. పూర్వ మొకప్పు డయోధ్య నవాబుకును నింగ్లీషువారికిని జరిగిన సంధిప్రకారము షూజా ఉద్దౌలా కుమారుడగు "అసఫ్ ఉద్దౌలా" ను నడుచుకొనవమని హేస్టింగ్సు చెప్పినప్పు డతని యాలోచనసభవా రందుల కొప్పుకొనరైరి. వీ రాణనికి వ్యతిరిక్తముగా గంపెనీవారికి బూర్వమునుండి చెల్లింపవలసిన బాకీ సొమ్మునిచ్చుకొమ్మనమనియు, మహమ్మదీయ పద్ధతికి వ్యతిరేకముగ విధవలగు దన తల్లికిని, దన తండ్రితల్లికిని (The Begums of Oudh) యింతకుబూర్వ మిచ్చిన డబ్బుగాక ఇప్పుడు రెండుకోట్ల రూపాయీలిచ్చుకొమ్మని తీర్మానించిరి. హేస్టింగ్సు ఇటుల నొకవైపున న్యాయమునకై పోరాడుచుండ "నందకుమార్" అను నొక బ్రాహ్మణుడు తన కుమారున కుద్యోగ మిప్పించెదనని హేస్టింగు తనవద్ద లంచము గైకొనినటుల నేరముమోపి, కౌన్సిలులో బిర్యాదు దాఖలు చేసెను.



హేస్టింగ్సు కౌన్సిలర్లచే తీర్మానింపబడుట కొప్పుకొనక, యద్దాని నింగ్లాండులోనున్న డైరెక్టర్లకు బంపెను. కాని మరునాడు నందకుమారు తాను దీసుకొనిన గోతులో దానేపడెను. ఎందుచేతననగా నితనిపై నొక ముసల్మాను ఫోర్జరీ (Forgery) చేసి కొంతసొమ్ము నీతడు తెచ్చికొనినటుల గలకత్తా సుప్రీము కోర్టువారికి దెలియపరచెను. వారు వెంటనే యితనిని విచారించి యురి దీయించిరి. ఇదంతయు బైకి హేస్టింగ్సు చేయించినటుల గాన్పించును. (కాని హేస్టింగ్సు నిజముగా నిర్దోషియని కొందఱు చెప్పెదరు.) ఈవిధంబున హేస్టింగ్సు ఎన్ని బాధల పాలైనను నన్నిటిని సహించి, తన స్వేచ్ఛానుసారముగ బనులను జరుపుచుండెను.

## మొదటి మహారాష్ట్రయుద్ధము (క్రీ. శ. 1778-1782)

మహారాష్ట్రులను గూర్చి మీకు కొంతవరకు దెలిసియే యున్నది. మహారాష్ట్రులు మిగుల బరాక్రమవంతులు. వీరిలో బరాక్రమనీయులగు నైదు వంశములవా రైదుచోట్ల బరిపాలించుచుండిరి. అందు పీష్వా పూనాలోను, సింధియా గ్వాలియరులోను, హోల్కార్ ఇండూరులోను, భాన్స్లే వంశమువారు నాగపూరులోను, గైక్వార్ బరోడాలోను నుండిరి.

పూనాలోనున్న పీష్వాలలో నాల్గవవాడగు మాధవరావు రాజ్యమునకు వచ్చుసరికి బాలుడుగ నుండెను కనుక నితడు రఘునాధరావు సంరక్షణలో నుండెను. ఇట్లుండ నితడు 1772 లో జనిపోయెను. తరువాత పీష్వా స్థానమును వహించిన నారాయణరావు కూడ మిగుల జిన్నవాడు. గనుక రఘునాధరావే సంరక్షకుడాయెను. కొలదికాలములో నారాయణరావు చంపబడుటచే రఘునాధరావే పీష్వాయాయెను. కాని మహారాష్ట్ర నాయకుడగు నానాఫర్నవీస్ మున్నగువా రందఱును నీతడే నారాయణరావును చంపించెనని యత

నితో యుద్ధముసేయ సమకట్టిరి.




ఇట్టిసమయములో దక్షిణతర గవర్నరులు చాల దేశమును బరిపాలించుచున్నారని వగచియున్న బొంబాయి గవర్నరేలాగైనను మహారాష్ట్రదేశమును వశపరచుకొనుటకు బ్రయత్నించుచుండెను. ఈ సంగతి రఘునాథరావు గ్రహించి 1775 లో సూరట్ వద్ద బొంబాయి గవర్నరు సహాయమును గోరెను. సాలసత్తి, బాసీను లనెడి రెండు ద్వీపముల నింగ్లీషువారికిచ్చుటకత డొప్పుకొనెను. అందుచే బొంబాయి గవర్నమెంటువా రతనికి సహాయముచేయుట కొప్పుకొనిరి. కాని యీసంధి రెగ్యులేటింగు ఆక్టుకు వ్యతిరిక్తముగా బొంబాయి గవర్నరు జరిగించుటచే 1776 లో పురంధరువద్ద తిరుగా యింగ్లీషువారికిని రఘునాథరావునకును సంధి జరిగెను ఇందువలన కలకత్తా గవర్నమెంటువారు రఘునాథరావుకు సహాయముచేయుకనే సాలసత్తి, బాసీనులను దీసికొన నిశ్చయించిరి. కాని కొలదికాలములోనే పై రెండు ఒడంబడికలను యింగ్లాండులో నున్న కోర్టు ఆఫ్ డైరెక్టర్లు విచారించి



సూరట్ సంధిని ఖాయపరచిరి. ఇట్లుండ, యూరపులో దిరుగ ఫ్రెంచివారికిని, ఇంగ్లీషువారికిని యుద్ధము దటస్థించినందున ఫ్రెంచివారు నానాఫర్నవీసు మున్నగు మహారాష్ట్రుల పక్షమునను, ఇంగ్లీషువారు రఘునాథరావు వైపునను జేరి ఇండియాలో 1778 మొదలు 1782 వరకు ఘోరముగ బోరాడిరి.

తొలుత నింగ్లీషువారు సాలసత్తి, చంద్రనాగూర్, పుదుచ్చేరులను బట్టుకొనిరి. కాని తరువాత వా రోడిపోయి నానాకష్టములును బడసాగిరి. ఈసంగతి హేస్టింగ్సునకు దెలిసినతోడనే 6000 సైన్యమును మహారాష్ట్రులపై బంపెను. ఈ సైన్యము అహమ్మదాబాద్, బాసీను మున్నగు బహుదేశములను; సింధియా, హోల్కారులను మట్టపెంచి బరోడా రాజగు గైక్వారుతో సంధి జేసికొనెను. తుదకు రెండుపక్షములవారికిని 1782 లో ‘సాల్బాయి’ యను చోట సంధి జరిగెను. ఇందువలన నింగ్లీషువారు సాలసత్తి, గ్వాలియర్ల నుంచుకొనుటకును; బాసీను, గుజరాతులను నానాఫర్నవీసున కిచ్చుటకును; రఘునాథరావునకు 4 లక్షల రూపాయలు సాలునకు పెన్షను నిచ్చుటకును; నారాయణరావు కుమారుని పీష్వాగా జేయుటకును నిర్ణయమును జరిగెను.

## మైసూరు యుద్ధములు

పూర్వము మైసూరు హిందూరాజులచే బరిపాలింపబడుచుండెను. వీరల సంస్థానమున హైదరాలీ యను నొక మహమ్మదీయుడు తన శక్తి సామర్థ్యములచే సేనాధిపతి యయ్యెను. పిమ్మట మైసూరు రాజు చనిపోవగనే 1760 నాటి కీతడు మైసూరు సింహాసనమును స్వాధీనము సేసుకొని యిరుగుపొరుగుల రాజుల నందఱిని జయించెను. 1780 నాటికి దన రాజ్యమును దూర్పున దూర్పుకనుమలవరకును, పడమట నరేబియా సముద్రమువరకును, ఉత్తరమున కనకగిరి,

కర్నూలు, కృష్ణానదివరకును, దక్షిణమున మధురవరకును వ్యాపింప జేసికొనెను.

దక్షిణ యిండియా నంతయు దానే పరిపాలింపవలెనని హైదరాలీ కొక కోరిక యుండెను. దీనిని నెరవేర్చుకొనుట కితడు ముందు మహారాష్ట్రులను, నైజామును, ఇంగ్లీషువారిని జయింపవలెను. కనుక యితడు 1769 లో మదరాసును ముట్టడింప బ్రయత్నించెను. కాని యాసంవత్సరముననే ఇంగ్లీషువారితో నితడు సంధి చేసుకొనెను. ఇందువలన నొకరితో నొకరు స్నేహముగలిగి సహాయ్య మొనరించు కొన నిశ్చయించుకొనిరి. దీనినే మొదటి మైసూరు యుద్ధ మందురు.

కాని 1770 లో మహారాష్ట్రులతో, హైదరాలీ యుద్ధము చేయవలసి వచ్చినపుడు వాని కింగ్లీషువారు సహాయమును జేయుట కంగీకరింపరైరి. ఇందుచే నితనికి వారిపై మిగుల గోపముకలిగి ఫ్రెంచి వారితో స్నేహముచేసెను. ఇట్లుండ, 1780 నాటికి యూరపులో నింగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని యుద్ధము దటస్థించెను. కాబట్టి యిండియాలో గూడ నిరువురికిని వైరము తటస్థించెను. వెంటనే యింగ్లీషువారు హైదరాలీ యనుజ్ఞలేకుండ వాని రాజ్యముగుండా పోయి, మలబారు తీరమందున్న 'మహె' యను ఫ్రెంచివారి పట్టణమును ముట్టడించిరి. సమయమిదే యని హైదరాలీ మహారాష్ట్రులతోను నైజాముతోను సంధి చేసుకొని యింగ్లీషువారిని 'పొలెలూరు' (Pollilore) వద్ద నోడించెను. తరువాత నితడు వెల్లూరువైపు దాడి వెడలు చుండ వారన్ హేస్టింగ్సున కీసంగతి తెలిసి యతి చమత్కారముగ మహారాష్ట్రులతో సంధి చేసికొని నైజామును హైదరాలీ నుండివేరు పరచెను. ఆట్టిసమయమున వారన్ హేస్టింగ్సు జోక్యము గలుగ జేసుకొనక పోయినచో నాంగ్లేయ ప్రభుత్వ మిండియాలో నప్పుడే చల్లారిపోయి యుండును. ఇంగ్లీషువారు 1781 లో 'పోర్టునొవో' యను చోట హైదరు నోడించిరి. మరుచటి సంవత్సరమున రెండవ ఆర్కాటు యుద్ధములో వీరిచే నింకొకసారి హైదరోడిపోయి, తుదకు ప్రాణ



ములను గోల్పోయెను. ఇతని కుమారుడగు టిప్పు సుల్తాను 1784 లో మంగళూరిలో (Mangalore) నింగ్లీషువారితో సంధి చేసికొనెను. ఇందువలన నెవరి రాజ్యములు వారికి ఖాయాపడినవి.

—♦ మైసూరు యుద్ధములను దెల్పు పటము ♦—




1785 లో హేస్టింగ్సు ఇంగ్లాండునకు బోయెను. అంత్య దశయం దితడు గూడ క్లైవువలె, మిక్కిలి కష్టపడవలసివచ్చెను. ఇతడు గవర్నరుగానుండి ప్రజలకు సౌఖ్యమును గలిగించి కంపెనీవారికి ధన

వ్యయమును తగ్గించెను. గవర్నరు జనరలైనతరువాత, మహారాష్ట్రులతో యుద్ధములు చేసి బ్రిటిష్ రాజ్యమును స్థిరముగ హిందూస్థానమున నిలబెట్టెను. ఇట్టివానితో దన యాలోచనసభవారేకీభవించినచో, గిలెడట్లింగ్లీషు రాజ్యము నభివృద్ధిపరచునో యాలోచింపుడు.

## 10. ఆంగ్లేయ దొరతన మభివృద్ధియగుట

వారన్ హేస్టింగ్సు తర్వాత గవర్నరు జనరలుగా వచ్చినవారిలో ముఖ్యుడు లార్డు కార్న్ వాలీసు. ఇతని పరిపాలన మనేకరీతుల బ్రాముఖ్యత జెందినది. క్లైవు హేస్టింగ్సుకూడ మాన్పలేని కంపెనియుద్యోగస్థులు తమ స్వలాభమునకై చేయుచుండిన వర్తకము నితడు మాన్పెను. వారు స్వదేశరాజులవద్ద లంచములు మన్నగునవి పుచ్చుకొననీయకుండునటుల నితి డేర్పాటుచేసెను. ఇదియునుగాక శిస్తులు వసూలుచేయుట యందుగూడ నొక క్రొత్త యేర్పాటిత డొనర్చెను. ఇందువలన భూములపై వేయబడిన పన్ను లెప్పుడును మారకుండునటుల నేర్పడెను. దీనినే "శాశ్వతపు పన్ను నిర్ణయము" (Permanent Revenue Settlement 1793) అని యందురు. ఇది కంపెనివారికి, జమీందార్లకు, ప్రజలకునుగూడ మిగుల ననుకూలముగా నుండెను. ఇందువలన యినాందారులకు జమీందారులు శాశ్వత పట్టాల నిచ్చుటచే, తమవద్దనుండి వారెన్నడును దిరుగ భూములను గైకొనరని నిబ్బరపడి భూముల నభివృద్ధిపరుప దొడగిరి. జమీందారులు ప్రభుత్వమువారికి జెల్లింపవలసిన పన్ను మొత్తమెన్నడును మారిహెచ్చవకుండుటచే వారికి లాభకరముగ లేకుండెను. కాని వారికి లోబడినవారి యొక్కలాభమే వారికి క్షేమముగలిగించుచున్నది.

ఇతనికాలమందు జరిగిన యుద్ధములలో ముఖ్యమైనది. మూడవ మైసూరు యుద్ధము. టిప్పు సుల్తాను మంగళూరువద్ద యింగ్లీషువారితో జేసికొనిన సంధిని పాటింపక తన తండ్రివలె దనకును గోరిక



యుండుటచే ఇంగ్లీషువారితో యుద్ధము చేయ ప్రయత్నించెను. తోడనే ఫ్రెంచివారివద్దకు రాయబారిని బంపి తన కింగ్లీషువారి కెదురుగ సహాయము చేయుమని కోరెను. ఇట్టి సమయములో నింగ్లీషువారి స్నేహితుడగు నైజాము, టిప్పు సుల్తానుపై యుద్ధము చేయదలచియుండెను. తనకున్న సైన్యముతో దా నొక్కడును టిప్పు నోడింపజాలనందున నింగ్లీషువారి సహాయమును గోరెను. అప్పటి కిండియాలో నున్న యింగ్లీషు గవర్నరు జనరలగు కార్న్ వాలీస్ అందుల కొప్పుకొని అందుకుగాను నైజామువద్దనుండి గుంటూరుజిల్లాను గైకొనెను. ఈసంగతి విని టిప్పు ఇంగ్లీషువారి స్నేహితుడగు తిరువాన్ కూర్ రాజుపై యుద్ధమునకు వెడలెను. పూర్వము తిరువాన్ కూర్ రాజునకును యింగ్లీషువారికిని జరిగిన సంధిప్రకారము కార్న్ వాలీస్ ఇతనికి సహాయము సేయవలసివచ్చెను. పై మూడు కారణములవలన మూడవ మైసూరు యుద్ధము మొదలిడెను.

ఈయుద్ధము 1790 మొదలు 1792 వరకును జరిగెను. ఇందు నైజాము, కార్న్ వాలీస్, తిరువాన్ కూరు రాజు, మహారాష్ట్ర నాయకుండగు నానాఫడ్నవీస్ మున్నగువారు గలసి, ఫ్రెంచివారి సహాయమును బొందిన టిప్పు సుల్తానుపై యుద్ధము చేయదొడగిరి. ఇంగ్లీషువారు తొలుత దిండిగల్, మలబారులను ముట్టడించి, తరువాత బెంగుళూరుపై దాడివెడలిరి. ఇందు కార్న్ వాలీస్ స్వయముగా బోరాడి బెంగుళూరును స్వాధీనము గావించుకొనెను. పిదప, టిప్పు సుల్తాను యొక్క ముఖ్యపట్టణమగు శ్రీరంగపట్నమును ముట్టడివేసెను. ఇంగ్లీషు సైన్యములకు జాల దినములనుండి క్రమముగా నాహారములేక జబ్బులచే బాధపడుటచే కార్న్ వాలీస్ వెనుకకు మరలవలసివచ్చెను. కాని యింతలో మహారాష్ట్రులు తమకు సహకారులగుటచేత 1792 లో శ్రీరంగపట్నంవద్ద టిప్పునోడించి యతనితో సంధిజేసికొనెను. ఇందువలన టిప్పు యింగ్లీషువారికిని, వారితో గలసి పోరాడినవారికినిగూడ దన రాజ్యములో సగము భాగ మిచ్చుటకును, యుద్ధపు ఖర్చునకై

౩ కోట్ల ౩౦ లక్షల రూపాయిలా నింగ్లీషువారి కిచ్చుటకును, యుద్ధములో బట్టుపడినవారి నందఱిని విడుదలజేసి యింగ్లీషువారితో స్నేహితునిగ నుండుటకును నొప్పుకొనెను. ఇందువలన ఇంగ్లీషువారు తమ రాజ్యమును మలబారు, మధుర, సేలంజిల్లాలలో స్థాపించుకొనిరి. కూర్గుదేశపు రాజు వీరికి సామంతుడాయెను.

టిప్పు దాను బోగొట్టుకొనిన జిల్లాల నెల్లను మరల సంపాదింపవలెనని యుద్దేశించి యందులకై యతడు నిరీక్షించుచుండెను. ఇట్లుండ యూరపులో నింగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని ఘోరముగ యుద్ధములు జరుగ నారంభించెను. అందు ఫ్రెంచి చక్రవర్తి యగు నెపోలియన్ (Nepoleon Buonaparte) ఇంగ్లీషు ప్రభుత్వమును నిర్మూలము గావించెదనని కంకణము గట్టుకొని యుండెనన్న సంగతి టిప్పు వినవచ్చెను. ఇంతలో నెపోలియన్ ఇండియాలోగూడ నింగ్లీషు ప్రభుత్వమును నాశనముసేయ నిశ్చయించి యందులకై ఈజిప్టుదేశమునకును వచ్చెను. ఈసంగతి టిప్పు విని వెంటనే యతని సహాయమును గోరి యద్దానిని బొందెను.

ఇంతట 1798 లో 'మార్క్విస్ ఆఫ్ వెలస్లీ' యనువాని నిండియాకు గవర్నరు జనరలుగా బంపిరి. ఇతడు ఫ్రెంచి ప్రభుత్వమును బూర్తిగ నాశనముచేసి నాంగ్లేయు లనేక చ్ఛత్రాధిపతులుగ జేయ నిశ్చయించి యుండెను. కనుక వచ్చినతోడనే యితడు హైదరాబాదు నైజాముతో సంధి చేసికొని, అతనివద్దనున్న ఫ్రెంచి యుద్యోగస్థులను దీయించివేసెను. ఇంతేగాక యతనివద్ద 6000 నింగ్లీషు సైన్యమునుంచి యతని సహాయమున టిప్పుతోను ఫ్రెంచివారితోను యుద్ధము చేయసాగెను. ఈ యుద్ధముననే నాల్గవ మైసూరు యుద్ధ మందురు.

వెలస్లీ 'జనరల్ హారిసు' ను 60000 సైన్యముతో టిప్పుపైకి బంపగా నతడు టిప్పును మాల్వెల్లీ (Mallavelli) వద్ద 1799 లో నోడించెను. వెంటనే యింగ్లీషువా రతని ప్రధాన పట్టణమగు శ్రీరంగపట్టణమును ముట్టడించిరి. ముట్టడిలో టిప్పునకు గుండుదెబ్బ తగిలి



చనిపోయెను. ఇతనితో మైసూరురాజ్యము నేలిన మహమ్మదీయవంశ మంతమయ్యెను. వెలస్లీ టిప్పు కుమారుల కిద్దఱికిని తగిన పెన్షనిచ్చి వెల్లూరునకు బంపించెను.

యుద్ధములో నింగ్లీషువారికి సహాయ మొనర్చిన నైజామునకు గూటీ, గురమ్మకొండ యనెడి ప్రదేశములను వెలస్లీ యిచ్చెను. కన్నడము, కోయంబత్తూర్, వైనాడ్ మున్నగునవి ఇంగ్లీషువా రుంచుకొనిరి. మిగిలిన రాజ్యమును హైదరాలీకి బూర్వమున్న మైసూరు రాజవంశములోని వాడగు 'కృష్ణయ్య' కిచ్చి యతనిని సామంతునిగ జేసికొనెను. ఇతనియొద్ద పూర్ణయ్య యనువాడు మంత్రిగ నుండెను.

ఈయుద్ధము లన్నిటిలోను యింగ్లీషువా రేల జయమునొందిరి? 1785 నాటికి గవర్నరులు, హేస్టింగ్సువలె కేవలము తమ యాలోచన సభవారి కట్టుదిట్టములలోనే యుండలేదు. వీరికిప్పటికి తమ సభవారి యొక్క యుద్దేశములకు వ్యతిరేకముగా గూడ చేయుట కధికారముండెను. కనుక యొక్కని బుద్ధికుశలతచే నీయుద్ధములన్నియు జరుపబడెను. మఱియు వీరి యుద్ధభటులవలెగాక స్వదేశరాజులవద్దనున్న సిపాయిలకు దర్బిజు లేకుండెను. హిందూరాజులలో బరస్పర వైరములు మిక్కుటముగా నుండెను. ఐకమత్యముతో నెట్టిపనినైన నతిత్వరగా జేయవచ్చును గాని పరస్పర విరోధముతో నెట్టి స్వల్పపనినైనను నెరవేర్పజాలము. ఇటులనే అప్పటికాలపు స్వదేశరాజు లొకరిపచ్చనొకరోర్వ లేకుండిరి. తుద కింగ్లీషువారి పాదములే వారికి శరణ్యమగుచుండెను. ఇంతకు వారికి నౌకాబలము గూడ నేమియు లేకుండెను. ఇన్నిటికిని ముఖ్యము స్వదేశ సైనికుల కేవలజీతము లానెరాకయున్నందకుంటుటచేత సైనికులు మరింత బాధనొందవలసివచ్చెను. స్వదేశ సైనికుల యవస్థ యిట్లుండగా వారి దారిద్ర్యభూతము వారి నెట్లు విడువగలదు ? బహుసౌకర్యములు గలిగిన యింగ్లీషువారికి విజయ మెట్లు గలుగకుండును ?

ఇక వెలస్లీ యుద్ధము గావింప నక్కఱ లేకుండ (1) కర్ణాటకము

(2) తంజావూరు (3) కడప, కర్నూల్, అనంతపురం జిల్లాలను సంపాదించెను

కర్ణాటకము :— ఇంగ్లీషువారు చందాసాహేబు నోడించి కర్ణాటకమునకు మహమ్మదాలీని నవాబుగ జేసిరన్న సంగతి మీకు దెలిసియే యున్నది. ఇతడు రాజ్యమును బాగుగా నేలక యింగ్లీషువారి కియ్యవలసిన సొమ్మును గూడ చెల్లింపకుండెను. ఇతడు 1769 లో చనిపోయెను. తరువాత నితని కుమారుడగు 'ఉమద్-ఉల్-ఉమ్రా' ఇంగ్లీషువారితో యుద్ధముచేయ నూహించి, నాల్గవ మైసూరు యుద్ధమున టిప్పుతో గలిసెను. ఈసంగతి తెలిసినతోడనే, వెలస్లీ యతనిని సింహాసనభ్రష్టునిగ జేయ నిశ్చయించెను. ఇంతలో 1801 లో నతడు కాలముజేయగనే యతని సంతతివారికి పెన్షనిచ్చి కర్ణాటకము నింగ్లీషు రాజ్యములో జేర్చెను.

తంజావూరు:— పూర్వముతంజావూరు మహారాష్ట్రులయేలుబడిలోనుండెను. వీరుమిగుల గతిమాలినవారై, ప్రజల నతిక్రూరముగ బాలించుచుండిరి, వెలస్లీ దీనినిజూచి 1799లో మహారాష్ట్ర ప్రభువులలో నిద్దరన్నదమ్ములు సింహాసనముకై తగవులాడుచుండ, సమయము దేయుని వారిరువురికిని 4 లక్షల రూపాయలు ప్రతి సంవత్సరమిచ్చుట కొప్పుకొని, వారిరాజ్యమగు తంజావూరు నింగ్లీషు రాజ్యములో జేర్చెను.

సీడెడ్ డిస్ట్రిక్ట్సు :— ఈజిల్లాలను (బళ్ళారి, కడప, కర్నూల్ అనంతపురం) నింకొకరీతి నింగ్లీషు రాజ్యములో గలపసాగెను. తొలుత నీ జిల్లాలన్నియు టిప్పుయొక్క పరిపాలనలోనుండెను. తరువాత నతడింగ్లీషువారిచే మైసూరు యుద్ధములలో నోడింపబడుటవలన వాని నింగ్లీషువారికివ్వవలసివచ్చెను. ఆయుద్ధములలో నింగ్లీషువారికి నైజాము మిగుల సహాకారియగుటచే నింగ్లీషువారా జిల్లాలనన్నిటిని నతనికిచ్చిరి. కాని 1800 లో నైజాముతో వెలస్లీ యొక యొడంబడిక జేసికొనెను. దీనివలన యింగ్లీషువారు నైజామునకు సహాయముగ హైదరాబాదులో దళ సైన్యమును గొంతయుంచిరి. నైజాము తనయొద్దనున్న యాంగ్లేయ సైన్య పోషణకై నై జిల్లాలనన్నిటిని వెలస్లీకిచ్చెను. దానపూర్వకముగ రా



బడిన జిల్లాలుగనుక వీటి కిప్పటికిని 'దత్తమండలములు', (Ceded Districts) అని పేరు.

వెలస్లీ తాను సంపాదించిన కర్ణాటకము, తంజావూరు, దత్తమండలములను, పూర్వమింగ్లీషువారు సంపాదించిన యుత్తర సర్కారులతో జేర్చి, చెన్నపురి రాజధానిగ జేసెను. ఇతనికాలములో మలబారుతీరము మొదలు కోరమాండలు తీరమువరకును, గోదావరి మొదలు కన్యాకుమారి యగ్రమువరకును చెన్నపురి రాజ్యము వ్యాపించెను.

## 11. సైన్యసహాకారపద్ధతి

(The system of Subsidiary Alliances.)



మార్క్విస్ ఆఫ్ వెలస్లీ.

వెలస్లీప్రభువు మన దేశమునకు గవర్నరుజనరలుగా వచ్చినప్పుడు మైసూరు, మహారాష్ట్ర రాజులు మిగుల బలాఢ్యులై యుండిరి. ఎల్లవారును ఇంగ్లీషువారి నిండియానుండి తరిమివేయుటకు బ్రయత్నించుచుండిరి. అందులకై వారు తమతమ యాస్థానములకు ఫ్రెంచి సేనానాయకులను దెప్పించి తమ సిపాయీలను యూరోపియను పద్ధతి ప్రకారము తరిఫీజు చేయుచుండిరి. ఇందుల కింతకు పూర్వము వచ్చిన గవర్నరు జనరలు యొక్క మతమే ముఖ్య కారణమై యున్నది. ఏలయనగా నతడు స్వదేశరాజుల తగవులలో జోక్య

మేమియు గలుగజేసికొనగూడదని తీర్మానించుకొనెను. (The Non-intervention policy of Sir John Shore.) ఇందువలన యింగ్లీషువారి ముఖ్య స్నేహితుడగు నైజాము ముందు మీరాయ చదువబోయెడి కొన్ని కారణములచే నింగ్లీషువారి స్నేహమును వదలి ఫ్రెంచివారి స్నేహితుడాయెను. టిప్పుసుల్తానునకును మహారాష్ట్రులకును వారిచ్చవచ్చినటుల జేయుటకు వీలుగలిగెను. కాని వెలస్లీ యట్టిదానిని దన ముఖ్యోద్దేశముగ బెట్టికొనక, దేశస్థితిని జూచి యందుల కనుగుణముగా నొకపద్ధతి నేర్పరచెను. అత డేర్పరచిన పద్ధతినే "సైన్య సహకార పద్ధతి" యని పిలువబడుచున్నది.

స్వదేశ రాజులవద్ద నిదివఱకున్న ఫ్రెంచి యుద్యోగస్థులను వారు దొలగించి వారికి బదులుగ నింగ్లీషుద్యోగస్థులను గొందరి నుంచుకొనుటకును, తమలో నొకరిపై నొకరికుండిన పరస్పర వైరభావములను తాముబోగొట్టుకొని యొకరితో నొకరు యుద్ధములు సేసికొననీయకుండునటుల జేయ నిశ్చయించి, ఈ సైన్య సహకార పద్ధతిని వెలస్లీ గుదురుపఱచెను.

(1) ఈపద్ధతి కొప్పుకొనిన ప్రతిరాజును దన యాస్థానమున నొక బ్రిటిష్ రెసిడెంటును, ఒక బ్రిటిష్ సేనను నుంచుకొనవలెను. ఆసేన నింగ్లీషువారే పోషించెదరు. అందులకై వా రింగ్లీషువారికి దమ రాబడిలో గొంత సొమ్మైనను, లేనిచో తమ రాజ్యములో నొక భాగమునైనను విడిచిపెట్టవలెను. ఇందు రెండవదాని ప్రకారము ఇంగ్లీషువారు నైజామువద్దనుండి 1800 లలో ముందు మీరాయ చదివిన దత్తమండలములను గైకొనిరి. (2) ఈపద్ధతియొక్క షరతుల నన్నిటికిని నొప్పుకొనినవా రొకరితో నొకరు పరస్పర వైరము గలిగియుండరాదు. (3) ఒకవేళ యుద్ధము చేయవలసివచ్చినప్పు డింగ్లీషువారి యనుమతి గైకొని జరిగించవలెను. (4) వారు తమతమ సంస్థానములలో నున్న ఫ్రెంచి యుద్యోగస్థులను వెంటనే తీసివేయవలయును. (5) ఇతరులగు నైరోపాజాతివారితో నెట్టిధంబగు సంబంధములను



గలుగజేసికొనగూడదు. (6) ఈషరతుల కంగీకరించిన రాజులు తమ స్వేచ్ఛానుసారముగ రాజ్యమును బాలించుకొనవచ్చును. అట్టివారి నింగ్లీషువారు శత్రుబాధలనుండి తొలగించి కాపాడుదురు.

ఈపద్ధతికి దొలుత నైజాము, టిప్పు, అయోధ్యనవాబు, పీష్వా బాజీరావు యొప్పుకొనకుండిరి. సర్ జాన్ షోరు గవర్నరుగా నున్నప్పుడు మహారాష్ట్రు లింగ్లీషువారి స్నేహితుడగు నైజాము నెదిరించిరి. పూర్వము ఇంగ్లీషువారు నైజామును జేసికొనిన యొడంబడిక ననుసరించి యిప్పుడు నైజా మింగ్లీషువారి సహాయ మపేక్షింపగా సర్ జాన్ షో రందులకు సమ్మతింపకుండెను. అందుచే నైజా మప్పటినుండి ఫ్రెంచివారి సహాయమును బొంది తన సేనలలో ఫ్రెంచి యధికారులను నియమించుకొనెను. కాని, వెలస్లీ గవర్నరుకాగానే నైజాముతో స్నేహముగ నుండుట మంచిదని తలచి యాతనితో సంధి కొప్పుకొనెను. దీనివలన నైజాము తనవద్ద నిదివరకుండిన ఫ్రెంచి యధికారులను దొలగించెను. పిదప, మైసూరు యుద్ధములైన తరువాత వెలస్లీ యొక్క సైన్య సహకార పద్ధతియొక్క షరతు లన్నిటికి నితడొప్పుకొని దత్తమండలముల నింగ్లీషువారి కిచ్చెను.

ఈరీతిగనే యయోధ్య నవాబుతోగూడ సంధిచేసికొని యాతని వద్దనుండి రోహిల్ఖండమును, గంగా యమునా నదుల మధ్యనున్న జిల్లాలను గైకొనెను. ఇక పూనాలోనున్న పీష్వాయగు బాజీరావుతో గూడ నీప్రకారముగనే యొడంబడిక జేసికొని యాతనిని దన సైన్య సహకార పద్ధతి కొప్పుకొనునటుల జేసెను. మైసూరులో నున్న కృష్ణ రాజుగూడ నందుల కొప్పుకొనెను.

సైన్య సహకార పద్ధతివలన గలిగిన ఫలితములు:—ఈపద్ధతికి లోబడిన స్వదేశరాజు లందఱు నింగ్లీషువారికి లోబడియుండిరి. పూర్వమునుండి కూలికి గుదిరి తర్ఫీజులేని స్వదేశ సైనికు లిప్పుడు పోయి మిగుల తర్ఫీజొందిన ఇంగ్లీషు సైనికులు ప్రతి సంస్థానమునందు నుండిరి. ఇంగ్లీషువారిచేతనే వీరు పోషింపబడుటవలన వా రింతకుబూర్వము

వారివలె గాక బాగుగా యుద్ధములు చేయుచుండిరి. ఇందువలన దేశములోనున్న సైన్యమంతయు నింగ్లీషువారి స్వాధీనములో నుండుటచే వారే దేశచ్ఛత్రాధిపత్యము వహింపగలిగిరి. స్వదేశరాజుల యంతఃకలహము లప్పటికి కడగి దేశమందు స్వస్థత గలిగెను. స్వదేశ రాజులు వారి రాజ్యములను బాగుగా బరిపాలింపవలెనన్న పూచీ వారికి గలదన్నమాట నెరుంగకుండిరి. ఒకవేళ యుద్ధము తటస్థించినను వారల కింగ్లీషువారు తప్పక సహాయ మొనర్చెదరని వారు పూర్తిగ నమ్ముచు, తుచ్ఛసుఖములలో మునిగి యుండిరి.

## —♦ 12. మహారాష్ట్ర యుద్ధములు ♦—

1800 లకు మొగలాయీ రాజ్యము పూర్తిగ నిర్మూలమాయెను. సింధియా ఢిల్లీనికూడ వశపరచుకొనెను. ప్రసిద్ధిగాంచిన హైదరుయొక్కయు, వాని సంతతి వారియొక్కయు, పరిపాలన మంతమయ్యెను. ఆకాలమున యింగ్లీషువారి ప్రభుత్వమున కీడుదీయక మహారాష్ట్ర లైదుచోట్ల పరిపాలించుచుండిరి. పూనాలో పీష్వా రెండవ బాజీరావుయును; గ్వాలియరులో దౌల్తురావు సింధియాయును; ఇండోరులో జస్వంతరావు హోల్కారుయును; నాగపూరులో రఘోజీ భోన్‌స్లేయును; గుజరాతులో గైక్వారుయును గలరు.

ఇట్లుండ, 1796 లో రెండవ బాజీరావు పూనాలో పీష్వా పదవిని గాంచెను. కాని యితడు రాజ్యాంగ తంత్రముల నెఱుంగడు. అందుచే దౌల్తురావును మంత్రిగ జేసికొని రాజ్య మేలుచుండెను. దౌల్తురా విట్టి పదవిని గాంచుట జస్వంతరావున కిష్టము లేకుండెను. కనుక యిరువురకును వైరము దటస్థించెను. ఇంతలో, దౌల్తురావు ప్రోత్సాహముచే బాజీరావు జస్వంతరావు తమ్ముని నొకానొక దినమున జంపించెను. ఇదుపై జస్వంతరావు హోల్కారునకు మరింత కోపము గలిగెను. కనుక నతడు పీష్వా ప్రధాన పట్టణమగు పూనాపై దండెత్తి



బాజీరావు నోడించెను. తోడనే బాజీరావు వతిత్వరగా 'బేసిన్' పట్టణమునందున్న యింగ్లీషువారివద్దకు బారిపోయెను 1802 లో బాజీరావునకు, ఇంగ్లీషువారికిని బేసిన్‌వద్ద నొక సంధి జరిగెను. ఇందువలన వెల్లస్లీ ప్రభువుయొక్క సైన్య సహకారపద్ధతికి బాజీరావు పూర్తిగా నొప్పుకొని తనకుగల సమస్త హక్కులతోను సూరత్తు నింగ్లీషువారి కిచ్చివేయుగా వెల్లస్లీ యితనిని గాపాడుట కొప్పుకొనెను. తర్వాత నతడు బాజీరావును పీష్వాగా జేసెను.

బేసిన్‌సంధికింగ్లీషువారి బాధ పడజాలక గైక్వారొప్పుకొనెను. కాని మహారాష్ట్రులలో ప్రసిద్ధిగాంచిన సింధియా, భోన్‌స్లేలు మాత్రము తమనాయకుడగు పీష్వా యింగ్లీషువారికి లోబడినందులకు జాల జింతజెంది యయ్యవమానంబున కోర్వజాలక, తమకు దెలియపరుపకుండ యిట్టిసంధిని చేసికొనుటకు పీష్వాకు హక్కులేదనియు, తామీ సంధికొప్పుకొనమనియు, బిగ్గరగా జెప్పి, ఇంగ్లీషువారితో యుద్ధమునకు బూనిరి. దీనినే రెండవ మహారాష్ట్రయుద్ధమందురు. (1802-1803)

వెల్లస్లీ యొక్కొక్కటి 8 వేల భటులతో గూడుకొనిన యేడుసైన్యముల నేడుస్థలములందుంచి వారినందఱి నొక్కసారి మహారాష్ట్రులపై దుముకునటులేర్పరచెను. ఒకదానిని దన సహోదరుడగు "ఆర్థర్ వెల్లస్లీ" ని సేనాధికారునిగ జేసి అహమ్మదునగరముపైకి బంపెను. రెండవదానిని "స్టీవెన్సు" నాయకత్వముక్రింద గోదావరీప్రాంతమందుంచెను. మూడవదానిని 'జనరల్ స్టీవార్టు' (General Stewart) సైన్యాధిపత్యముక్రిందనుంచి కృష్ణా, తుంగభద్రాదుల మధ్యనుంచెను. 'జనరల్ లేకు' అనువానిక్రింద నాల్గవదానినుంచి సింధియాపైకిబంపెను. ఐదవదానిని బుందిల్ ఖాండు (Bundel Khand) పైకిని, ఆరవదానిని కటకముమీదకిని, ఏడవదానిని గుజరాతుపైకిని బంపెను.

1 భోన్‌స్లేఓడుట:—1803 లో ఆర్థర్ వెల్లస్లీ అహమ్మదునగరమును ముట్టడించి, దానిని వశపరచుకొనెను. రాఘురాను దక్షిణము

నకు వచ్చుసరికి "అస్సేయి" (Assayi) వద్ద సింధియా, భాన్స్లేలిత
ని నెదిరింపబూనిరి. వెల్లస్లీయొక్క సైన్యము 4500 ఉన్నప్పటికిని దన
శక్తిసామర్థ్యములచే 50000 సైన్యముగల తన శత్రుసైన్యము నెది
రించి పూర్తిగ నోడించెను. బర్హాంపురమును, అసిర్‌ఘుర్ కోటను స్టీవె
న్స స్వాధీనము గావించుకొనెను. వెల్లస్లీ బీరారునకు బోవుచుండ మా
ర్గమధ్యమున 'అర్గాము' రాజునోడించెను. పిదప, గావలిఘుర్ కోటను
ముట్టడించి మిగిలిన భాన్స్లేకోటలనన్నిటిని వశపరచుకొనెను. కనుక
భాన్స్లే 1803 లో 'దివాల్‌గాం' (Dewalgaon) అనుచోట ఇంగ్లీ
షువారితో సంధిచేసికొనెను. ఇందువలన బాలసూరు, కటకముల నిం
గ్లీషువారికిచ్చెను. వార్దానదికి పడమరనున్న ప్రదేశము మొదలు గావ
లిఘుర్‌నకు దక్షిణమువరకునుగల ప్రదేశము నైజామునకిచ్చెను. నాగ
పూరులో నొకబ్రిటిష్ రెసిడెంటునుంచుకొని, ఇంగ్లీషువారికి దెలియప
ఱుపకుండ నెవరితోను యుద్ధమునకు వెళ్ళకుండుటకు గూడ నొప్పు
కొనెను.

2. సింధియాఓడుట—ఇక నుత్తరహిందూస్థానమందున్న
యింగ్లీషుసైన్యాధిపతియగు 'లేకు' అనునతఁడు 'అలిఘుర్' వద్ద సింధి
యానోడించి, ఢిల్లీకిబోయెను. అచ్చట నంధుడును, ముదుసలియును,
మహారాష్ట్రులచే బట్టుపడినవాడునునగు 'రెండవషాలం' చక్రవర్తి
ని జెఱనుండి తప్పించెను. తరువాత ఆగ్రాను వశపఱచుకొని 'లాస్వా
రీ' యుద్ధమున ఫ్రెంచివారిని, సింధియాను బూర్తిగ నోడించెను.
వెంటనే సింధియా 'అంజనగాం' (Angengoan) అనుచోట యింగ్లీ
షువారితో సంధిచేసికొని, యమునాసట్లెజ్ నదులమధ్యనున్న జిల్లాలను,
జయపూర్, అహమ్మద్‌నగర్, బ్రోచినులను ఇంగ్లీషువారికిచ్చెను.
ఇటులనే గుజరాతు, కటకము, బందిల్‌ఖండులలోనున్న యింగ్లీషు
సైనికులుగూడ సింధియానోడించిరి. కనుక సింధియా సైన్యసహాకార
పద్ధతి షరతులన్నిటికిని నొప్పుకొనెను.

మూడవ మహారాష్ట్రయుద్ధము:—(1804-1805) ఇక మహా



రాష్ట్రులలో ఇంగ్లీషువారు జయింపవలసినవారు జస్వంతరావు హో
ల్కారుమాత్రమే మిగిలెను. సింధియా, భాన్స్లేలతో నింగ్లీషువారు
యుద్ధముచేయుసమయమున జస్వంతరావు కాలమునంతయు వ్యర్థపరు
పక యుద్ధమునకై సిపాయీలను దరిఖీజు చేయుచుండెను. రేపో
నేడో యింగ్లీషువారు తనతోగూడ యుద్ధము చేయుదురన్న సంగతి
నితడు పూర్తిగ నెఱింగి యద్దాని కుపచరించు సామగ్రిని జతపరుచు
కొని 1804 లో నుపయోగించెను.

రెండవమహారాష్ట్రయుద్ధమువలన నింగ్లీషువారికి జయపురపు
రాజు సామంతుడయ్యెనన్న సంగతి మీకు దెలిసియేయున్నది. ఇట్టి
యీజయపురపురాజుపై హోల్కారు యుద్ధముచేయ సమకట్టెను. ఇత
నిని రక్షించుటకై యింగ్లీషువారికి ముఖ్యావశ్యకమైయుండెను. కనుక
మహారాష్ట్రులతో నింగ్లీషువారు యుద్ధముసేయ మొదలిడిరి.

తొలుత నింగ్లీషువారు కొద్దిగా జయమునొందినను తుదకు
గొంతమట్టుకపజయము నొందిరి. ఇంగ్లీషుసైన్యాధిపతియగు 'ముర్రే'
అనునతడు, హోల్కారు ముఖ్యపట్టణమగు 'ఇండోరు' ను వశపర
చుకొనెను. హోల్కారునకీసంగతి దెలియగా నతడు, ఢిల్లీనగరమును
ముట్టడించుచు 'లేక్' అను నింగ్లీషుసైన్యాధికారిచే నోడింపబడెను.
పిదప నింగ్లీషువారు హోల్కారు స్నేహితుడగు భరతపురపురాజ
నెదిరించి తుద కోడిపోయిరి.

ఇట్టిసమయంబున నపజయంబులగోర్వజాలక తొలుతనుండియు
యుద్ధమన్న నిష్టములేని కంపెనీవారు, వెల్లస్లీ తమకొనర్చిన యుప
కారములన్నిటిని మఱచి, యతనిని 1805 లో గవర్నరు జనరల్ పద
వినుండి తప్పించిరి.

ఇతడింగ్లాండునకు బోయినతర్వాత వచ్చిన 'జార్జిబార్లో' ప్ర
భువు, హోల్కారుతో యుద్ధముచేయుటకు బదులతనితో సంధి
చేసికొనెను.

పీష్వా రెండవ బాజీరావుయొక్క ముఖ్యస్నేహితుడొకానొక
రోజున గైక్వారుయొక్క మంత్రియగు గంగాధరశాస్త్రిని జంపెను

అందుచే, పూనాలోనున్న యింగ్లీషు రెసిడెంటాతనిని ద్వీపాంత్రవాసము
నకు బంపెను. కాని యాతడించుక తెలివిగలవా డగుటచే దప్పించు
కొని పారిపోయెను. ఇట్లుండ, రెండవ బాజీరావు తా నింగ్లీషువారితో
జేసికొన్న సంధిప్రకారము నిలువక, ఇంగ్లీషువారి శత్రువులగు పిండారీ
లకును, ద్వీపాంత్రవాసమునకు బంపబడిన తన స్నేహితునికిని సహాయ
మొనరించెను. ఇట్టి కృతఘ్నుని సింహాసనమునుండి తొలగించు
టుచితమని తలచి యప్పటి గవర్నరు జనరలగు 'మార్క్వెస్ ఆఫ్
హేస్టింగ్సు అతనితో బోరాడి యతని నోడించెను. పిదప నతడు, బాజీ
రావును పీష్వా పదవినుండి తప్పించి తగిన పెన్షనిచ్చి బిత్తూరునకు
బంపెను. ఇతడు వశపరచుకొన్న జిల్లాలనే బొంబాయి రాజధానిగ
జేసెను.

ఈ యుద్ధములలో మహారాష్ట్రు లోడుటకు గారణము లెవ్వి?
ఎందుచేతననగా (1) మహారాష్ట్ర నాయకులలో బ్రసిద్ధిగాంచిన సింధి
యా హోల్కారు లెల్లప్పుడు వారి నాయకుండగు పీష్వా నోడించి
తాము ప్రసిద్ధికెక్కుటకు బ్రయత్నించుచుండిరి. (2) బ్రాహ్మణులగు
పీష్వాలకును బ్రాహ్మణేతరులగు నితర మహారాష్ట్ర నాయకులకును
జాతిభేదము లేర్పడినందున బరస్పర స్పర్ధలు గలిగియుండెను. (దౌలత్త
రావుయొక్క పూర్వీకులు పీష్వాలయొక్క పైజార్లను మోయువారు
గను, హోల్కారుయొక్క పూర్వీకులు గొల్లవాండ్రుగను యుండిరి.)
(3) ఐదవ పీష్వాయగు నారాయణరావు చనిపోయినతోడనే రఘు
నాధరావు నానాఫర్నవీసు లొకరితో నొకరు బోరాడసాగిరి. (4) ఇక
జస్వంతరావు దౌలత్తరావులకును, రెండవ బాజీరావునకును నైకమత్య
ములేక అంతఃకలహములు గలిగియుండెను. (5) మహారాష్ట్ర సైన్య
ములు మిగుల దరిఫీజు జెందియుండనందున మహారాష్ట్రు లోడిపోయిరి.

## 13. మార్క్వెస్ ఆఫ్ హేస్టింగ్సు. (క్రీ. శ. 1813-1823)

మార్క్వెస్ ఆఫ్ హేస్టింగ్సు గవర్నరు జనరలుగ మన దేశము
నకు రాకమునుపే స్వదేశరాజుల కందఱకు నిండియా పరిపాలన



చరించి కంసీవారియొక్క ముఖ్యోద్దేశము దెలిసెను. కంపెనీవారు తాము పంపెడు గవర్నరులకు స్వదేశ రాజులతో యుద్ధము జేయరాదనియు, దమవర్తక వ్యాపారమును ముఖ్యముగా గమనింపమనియు జెప్పడి మున్నగు సంగతులు పిండారీలు, ఘూర్కాలు, మహారాష్ట్రులు, అఫ్ఘనులు గ్రహించిరి. ఇందుచే నితని కాలమున వీరందఱు నింగ్లీషు రాజ్యము నపహరింప బ్రయత్నించుచుండిరి. ఇందుకు గారకులు కంపెనీ వారే యని చెప్పవచ్చును.

కనుక హేస్టింగ్సు వచ్చుసరికి దేశమంతయు నల్లకల్లోలముగ నుండెను. ఇట్టి తరుణములో నితడు కంపెనీవారు చెప్పిన చొప్పున జేసినచో మూడునిమిషములలో హిందూదేశమున కంతకును ముప్పు దెచ్చును. కాని యితడట్టి మాటలన్నిటిని బెడచెవిని బెట్టి యుద్ధములో బహు బుద్ధికుశలతతో బనిచేయుచుండెను. తొలుత నితడు ఘూర్కాలతో యుద్ధము చేయవలసి వచ్చెను. దీనినే నేపాళయుద్ధమందురు, (క్రీ. వె. 1814-15)

హిమాలయ పర్వతములకు దక్షిణమందు నేపాళమను దేశము గలదు. అందు తొలుత నివసించి యుండినవారు బౌద్ధులు. 1767 లో కాశ్మీరములోనున్న రసపుత్రులు, బ్రాహ్మణులును గొందఱు గలసి ఘూర్కాలనెడి నామమును వహించి, వీరినోడించిరి. వీరు యుద్ధము నందారి తారినవారగుటచేతను, మిగుల దురాశగలవారగుటచేతను దమకుగల రాజ్యముతో దృప్తినొందక గంగానదీతీరమందున్న ఇంగ్లీషు రాద్యములను దీసికొన బ్రయత్నించిరి. హేస్టింగ్సు వారికి దగిన శిక్షచేయదలచి వారితోయుద్ధముచేయ నారంభించెను.

ఈయుద్ధములో హేస్టింగ్సుచే నంపబడిన ఓక్టర్లోని (Ouchterlony) తొలుత నోడిపోయినను, దుదకు 'ఆల్మోరా' వద్దను 'మలానా' వద్దను ఘూర్కాలను బూర్తిగ నోడించెను. పిదప నుభయ శత్రులవారికిని సంధి గుదరనందున, నేఫాళమునకు ముఖ్యపట్టణమగు 'ఖాట్మాండూ' ను ముట్టడించినతోడనే ఘూర్కాలు వారంతటవారే

సంధికివచ్చిరి. దీనినే 'సిగాలి' (Segauli 1816) సంధియని యందురు. ఇందువలన నేపాళములో గొన్ని జిల్లాల నింగ్లీషువారు దీసుకొని ఖాట్మాండూలో నొక యింగ్లీషురెసిడెంటు నేర్పరచిరి. ఇంగ్లీషువారికి వచ్చిన పట్టణములలో సిమ్లా, నైనిటాల్, ముసారీ మున్నగునవి ముఖ్యమైనవి.

ఈయుద్ధము ముగిసినతోడనే హేస్టింగ్సు పిండారీలతో బోరాడవలసివచ్చెను. పిండారీలెవరు? వీరు ఔరంగజేబు కాలమున వానిచే బాధపెట్టబడి తుద కాతనిచే దగిలివేయబడిన హిందువులు. వీరు నర్మదానదీ తీరమందు నివసించెడివారు. వీరికి దోపిడియే ముఖ్యజీవనోపాయము. సాధారణముగా వీరు నాల్గువేలమందికూడి దోపిడి చేయుటకు పోవుదురు. దోపిడిచేయనుద్దేసించిన గ్రామసరిహద్దులకు వచ్చుసరికి నాలైదుసంఘములుగా మారి ప్రతివారును చిన్నచిన్న గుఱ్ఱములనెక్కి గ్రామస్థులకు దెలియకుండ హఠాత్తుగ దోపిళ్ళు చేయుచుండిరి. వీరు ప్రయాణకాలమున నేమియు దమతో దీసుకొని వెళ్ళక తమ తమ గుఱ్ఱపు జీనులపైనే నిద్రించుచుండిరి. స్త్రీపురుషాదులను జంపి వారిని జీల్చితినుచుండిరి. తమకు గావలసినదానిని గొనిపోయి, మిగిలినదానిని నాశముసేయసాగిరి. వీరినాయకులలో 'అమీర్‌ఖాన్' 'కరీమ్‌ఖాన్' లు ముఖ్యులు. వీరు సింధియా, హోల్కారులను జేరి కొన్నిరసపుత్ర గ్రామములను ముట్టడింపసాగిరి.

ఇట్టివారినోడించినగాని రాజ్యమునిలువజాలదని తలచి హేస్టింగ్సు వారితో యుద్ధమునకు బయలుదేరెను. మొదట దౌల్తరావు సింధియా నోడించి యతనితో గ్వాలియరువద్ద సంధి జేసికొనెను. పిండారీలను మాల్వానుండి చంబల్‌నది కవతల భాగమువరకును దగిలివేసెను. ఆజ్మీరులో నింగ్లీషు రెసిడెంట్లు నొకని నుంచెను.

ఇట్లుండ 1817 లో నాగపూరులోనున్న భాన్స్లే యింగ్లీషు రాయబారిపై దిరుగబడగా నతనని వెంటనే హేస్టింగ్సు ఓడించి



యింకొకని నాగపురాధీశునిగ జేసెను. అతనిరాజ్యములో గొన్నిజిల్లాల కింగ్లీషువారిని సార్వభౌములుగ జేసెను. వీనినే యిప్పటికిని మధ్యపరగణాలనియందురు. (Central Provinces).

తరువాత నితడు సింధియా హోల్కారులను గూడజయించి మహారాష్ట్రరాజ్యమునకంతటికిని నింగ్లీషువారిని సార్వభౌములుగ జేసెను. స్వదేశరాజుల ననేకులను సైన్య సహకారపద్ధతి కొప్పుకొను నటుల జేసి, ఇత డింగ్లాండునకు 1823లో బోయెను.

## 14. లార్డువిలియమ్ బెంటింకు (1825-1835)

విలియమ్ బెంటింకుప్రభువు మన దేశమునకువచ్చుసరికి కంపెనీ వారు బర్మాయుద్ధములో మునిగియుండుటవలన, వారికి చాల ద్రవ్యనష్టము గలిగెను. కనుక యేరీతినైనను ఖర్చుతగ్గించి రాబడి నభివృద్ధిజేయు నుపాయమును గనిపెట్టుమని యితనిని బంపిరి. ఇంతకుముందొకసారి యితడు చెన్నపురి గవర్నరుగా నుండినందున, హిందూదేశస్థితినిగూర్చి యితనికి బాగుగదెలియును. అప్పటి యీస్టిండియాసంఘము వారు లండనులోనున్న పార్లమెంటువారు విధించినపద్ధతులననుసరించి, పరిపాలించుచుండిరి. ఇందు కుదాహరణముగ 1773 లో పార్లమెంటు వారు నిర్మించిన "రెగ్యులేటింగ్ ఆక్టునుగూర్చి చదివియేయున్నారు.

బెంటింకుయొక్క ప్రభుత్వ మితరగవర్నరుజనరలుల ప్రభుత్వములవలెగాక, జనసామాన్యపుమేలుల ననుసరించి సత్కార్యములచే గూడుకొనియుండెను. ఇత డొనర్చిన సంస్కరణములలో "సహగమనము" అను ఘోరదురాచారమును మాన్పుట ముఖ్యమైనది. సహగమనమనగా బతివ్రతాశిరోమణులు దమభర్తలు చనిపోయి కాలుచున్న చితిపై దుమికి, దామునూడ వెంటనే ప్రాణములను విడుచుట. పూర్వకాలమునుండియు హిందూస్త్రీలు ముక్తి వచ్చునని యిట్టిపనిని గావించుచుండిరి. ఇట్టి స   మనమునొనర్చిన రాణీసంయుక్తనుగూర్చియు

రాణాభీమసింగుని భార్యయగు పద్మినిగూడ్చియు మీరు చదివియేయున్నారు. ఇట్టి ఘోరకృత్యమునందరును జేయ సమ్మతింపకుండిరి. తప్పించుకొని పోవయత్నించువారిని, వారిబంధువులు బలవంతముగ చితిలో ద్రోయుచుండిరి. ఇట్టి దురాచారమును మాన్పుటకు అక్బరు తొలుత బ్రయత్నించెనుగాని సఫలము నొందలేకపోయెను. 1829 లో బెంటింకు ప్రభు వొక చట్టము నేర్పరచి యద్దానిని బూర్తిగ మాన్పగలిగెను. ఈవిషయమునందితనికి రాజారామ్ మోహన్‌రాయ్" అను నతడు తోడ్పడెను.

రాజారామ్ మోహనరాయను నతడు 1774 లో జన్మించి యరబ్బీ, పారశీక, సంస్కృత, ఆంగ్లేయభాషల నభ్యసించి, మతవిషయమై తన తండ్రిగారితో గలహించి, కంపెనీయుద్యోగస్థునిగ 1813 లో గుదురుకొనెను. పిదప నందు విరక్తిబొంది, సహగమనము, విగ్రహారాధన, వర్ణభేదము, పెక్కుస్త్రీలను బెండ్లాడుటమున్నగు హిందూమతాచారములను ఖండించి యనేక పుస్తకములను వ్రాసెను. కొంతకాలమైనతర్వాత నితడు మహమ్మద్‌వలె దేవుడొక్కడేయని చెప్పి ప్రసిద్ధిగాంచిన బ్రహ్మసమాజ మతోద్ధారకుడాయెను. ఇతడు 1833 లో నింగ్లాండునకుబోయి నచ్చట చనిపోయెను.

బెంటింకుప్రభువొనర్చిన రెండవకార్యము 'థగ్గుల'ను నాశనముచేయుట. వీరికి బందిపోటు, దొంగతనము ముఖ్య జీవనోపాయములు వీరి కులదేవత జంతుహత్యనుగోరెడి కాళికాదేవి. ఆమె ప్రీతిననుసరించి వీరు తరచుగా బాటసార్లనుగలసి కొంతదూరము వారితో ప్రయాణముచేసి తుదకు వారివద్దనుంచుకొనెడి చేతిరుమాళ్ళను బాటసార్ల నోళ్ళయందుగ్రుక్కి వారినిజంపి వారిద్రవ్యముల నపహరించుచుండిరి. వీరు ప్రజలకు గలిగించెడి బాధలను జెప్పనలవిగాదు. ఇట్టిథగ్గులను నిర్మూలము గావింపదలచి బెంటింకు అచ్చటచ్చటకు నధికారులనుబంపి వారిని నిర్మూలము గావించెను.

కంపెనీవారి యనుజ్ఞప్రకారము దొలుత నితడు వారికగు ఖర్చులలో గొన్నిటిని తగ్గించెను. బంగాళము, బొంబాయి, మదరాసు రాజ్యములలోనున్న యింగ్లీషుసైన్యములను తగ్గించెను. సైనికులకు బూర్వమునుండియు మామూలుగానిచ్చెడి బత్తాలను తగ్గించెను. కారన్వాలీసు పెట్టించిన యప్పీలుకోర్టులను దీసివేసెను. ఇంగ్లీషుభాషను నేర్పించి దానిని రాజభాషగ జేసెను. అట్టి గొప్పవిద్య నభ్యసించిన మన దేశస్థుల కితడు యూరోపియనులకిచ్చెడి మేజస్ట్రీటుద్యోగముల నిచ్చెను. హిందువులు తక్కువజీతములకుగూడ గుదురుకొనసాగిరి. కనుక యిందువలన యితడు మనలను దృప్తిపరచుటయేగాక, కంపెనీ వారికి బూర్వమునుండియు హెచ్చుగ తగులుచున్న జీతములనుగూడ తగ్గించెను.

ఇక నితడు కంపెనీవారికిచ్చెడి రాబడి వృద్ధిపరచెను. ఇందుకితడు స్వదేశరాజ్యములలోనుండెడి నల్లమందువర్తకులపై బన్నువిధించి యందుమూలమున కంపెనీవారి రాబడిని వృద్ధిపరచెను.

థగ్గులను నిర్మూలముచేసి, సహగమనమునుమాన్పి, దేశక్షేమమునకై మిగుల పాటుపడి కంపెనీవారిరాబడిని హెచ్చించి వారికగు ఖర్చులనుతగ్గించి యితడు 1835 లో నింగ్లాండునకు బోయెను.

## —15. పొలిమేరప్రశ్న—

క్రీ. శె. 1828 నరికి ఇంగ్లీషువారు బొంబాయి, చెన్నపట్టణము, బంగాళము, ఒరిస్సాలను పాలించుచుండిరి. మహారాష్ట్ర, రసపుత్రరాజ్యములలోను, అయోధ్య, మైసూరు, హైదరాబాదు, భూపాలులలోను దమరెసిడెంటులనుంచి పరిపాలన జేయుచుండిరి.

ఇట్లుండగా 1824 మొదలు 1826 వరకును ఇంగ్లీషువారు బర్మారాజుతో యుద్ధము చేయవలసివచ్చెను. ఇంగ్లీషురాజ్యమునకు దూర్పు సరిహద్దుననున్న ప్రదేశములపై ననేకసారులు బర్మావారు దండెత్తసాగిరి. కాని యింగ్లీషువారందుల కూరకుండిరి. అందుచే నమయము చేయ

ని తలచి వారు మరింత చెలరేగుచుండిరి. తుదకు వారు ఢక్కా, మూర్షాబాదు, చిట్టగాంగు, మున్నగు ఇంగ్లీషుపట్టణములపైబడి, పూర్వము నుండి తమ రాజ్యములో నవి జేరియుండినవని వానిని స్వాధీనము జేసికొనసాగిరి. ఇంతేగాక బర్మారాజు 'అరక్కాను' జనులను మిగుల బాధపెట్టుచుండెను. వీరాబాధల కోర్వజాలక తుద కింగ్లీషువారికి శరణుజొచ్చిరి. శరణుజొచ్చిన యారక్కాను జనుల నప్పగింపవలసిన దని బర్మారాజు ఇంగ్లీషువారిని గోరెను. కాని యప్పటి ఇంగ్లీషు గవర్నరు జనరలగు 'లార్డు అమ్మహారెస్టు' (Lord Amherst) అందుల కంగీకరింపక వానిపై యుద్ధమునకు బూనెను.

—♦ బర్మాయుద్ధములను దెల్పు పటము ♦—






అమ్మహారెస్టు 11,000 యుద్ధభటులను బంగాళముమీదుగ బర్మాదేశమునకు బంపెను. వీరు ఘోరముగా బోరాడి రంగూన్, కిమిండైనులను స్వాధీనము చేసికొనిరి. మరుసటి సంవత్సరమున వీరు అస్సాము, మణిపురము, (పటములో ♦ గురుతు పెట్టబడినది) అరక్కాను, టెనాసరిము పట్టణములను స్వాధీనము చేసికొనగలిగిరి. పిదప నిరువెరగులవారికిని 'అండాబూ' అనుచోట నొకసంధి జరిగెను. ఇందువలన నింగ్లీషువారు అస్సాము, టెనాసిరమ్, అరక్కానులను సంపాదించిరి. కోటి రూపాయీలనుగూడ బర్మారాజువద్ద గైకొని, తమవారిలో నొకరిని బర్మాలో రెసిడెంటుగా నుంచిరి. ఈ యుద్ధము నకే మొదటి బర్మాయుద్ధమని పేరు.

వాయువ్యభాగమందు జరిగిన స్థితినిగూర్చి మీరిక నేర్పుకొనవలెను. 1808 సరికి 'అహమ్మద్ షహాదురానీ' సంతతిలోని వాడగు షాషూజా యనువాడు కాబూలుదేశమునకు 'అమీరు'గ నుండెను. ఇతనికి 'దొస్తు ముహమ్మద్' అను నొకమంత్రి గలడు. ఇతడు మిగుల కఠినహృదయుడును, రాజద్రోహియును నగుటచే దన ప్రభువును సింహాసనమునుండి తొలగించెను. వెంటనే షాషూజా యింగ్లీషువారి సహాయమును బొందెను. అట్టి సమయములో రష్యావారు మధ్య ఆసియాలో బ్రవేశించి కొన్ని రాజ్యములను స్వాధీనము చేసికొనిరి. వీరి ప్రయత్నములనుగుఱించి యింగ్లీషువారు మిగుల భీతి జెందుచుండిరి. ఎందుచేతననగా పారశీకము, ఆఫ్ఘనిస్థానములను వీరు స్వాధీనము చేసికొనినచో నిండియా నతిత్వరగా వశపరచుకొనగలరు. వీరి భీతి ననుసరించియే రష్యావారు తమ ప్రయత్నములను గూడ కొనసాగించిరి. వీరు పర్షియారాజుతో గలసి హిందూస్థానమును జయింప బ్రయత్నించి దొస్తు. ముహమద్‌తో స్నేహము చేయ మొదలిడిరి.

ఇట్టిసమయములో దేశక్షేమము కొఱకును, తమపై రష్యావారు, ఆఫ్ఘనులు, పర్షియావారు దండెత్తుచున్నారను భీతిచేతను;

తమ స్నేహితుడును శిక్కులకు రాజును నగు రంజితుసింగునకు షాషూజా మిగుల నిష్టుడగుటచేతను; డాస్టు మహమ్మద్ కన్న షాషూజాకు అఫ్ఘనిస్థానములో హెచ్చు బలుకుబడి యుండుటచేతను, ఇంగ్లీషువారు షాషూజా వైపున జేరి డాస్టు మహమ్మద్ పైని యుద్ధమునకు బూనిరి.

ఇంగ్లీషువారు తొలుత కందహారమును ముట్టడింపగా డాస్టు మహమ్మద్ యాయూరునుండి పారిపోయెను. తక్షణమే యింగ్లీషువారు షాషూజా నమీరుగ జేసిరి. కాని యితనిని ప్రజలు ప్రేమింపకుండిరి. కనుక యతని రక్షణకొఱకై యింగ్లీషువా రొక రెసిడెంటును గొంత సైన్యమును నుంచిరి. పిదప వీరు కాబూలునకు బోయి 'ఘుజ్నీ' కోటను ముట్టడించి స్వాధీనము చేసికొనిరి. 1840 నాటి కింగ్లీషువారు డాస్టు మహమ్మద్ ను చెఱపట్టిరి. ఈసంగతిని విని డాస్టు మహమ్మద్ కుమారు డింగ్లీషు రెసిడెంటును జంపివేసెను. ఇందుకు దోడుగ నింగ్లీషువారి కెచ్చట చూచినను నపజయములే సమకూడెను. కనుక 1841 లో నింగ్లీషువారు సంధి కొప్పుకొనిరి. కాని యింగ్లీషువా రిందులకు వ్యతిరేకముగ మరుచటి సంవత్సరములో తిరుగ యుద్ధమును జేయ మొదలెట్టిరి. స్త్రీ పురుషాదులందఱును యుద్ధమునకు బూనిరి. వీరు ఖూరట్, కాబూలు లోయలలోనుండి బండ రాళ్ళను గ్రిందకు ద్రోసివేయసాగిరి. ఈబాధకు దోడు చలిబాధ యొకటి మిగుల నధికముగా నుండెను. అందుచే నింగ్లీషు సైనికు లనేకులు మృతినొందిరి. ఇట్టి అపజయంబుల కన్నిటికిని గారకు డప్పటి గవర్నరు జనరలగు 'ఆక్లండు' వలననే సంభవించెనని కంపెనీవారు తలచి వాని నా పదవినుండి తప్పించిరి. పిదప వారు లార్డు ఎల్లిన్ బరో యను వానిని గవర్నరు జనరలుగా బంపిరి.

ఇత డిండియాకు వచ్చినతోడనే కందహార్, జలాలాబాదుల లోనున్న యింగ్లీషుసైన్యములను అఫ్ఘనిస్థానమునువదలి రమ్మని యుత్తరవునేసెను. ఇట్టిసమయమునకై వేచియున్న డాస్టుమహమ్మద్



అంములకుప్పొంగి తిరుగ అమీరయ్యెను. మొత్తముపై నింగ్లీషువారికీ యుద్ధమువలన ధనవ్యయమును, ప్రజానష్టమును దప్ప తదితరలాభములు లేకపోయెను.

అఫ్ఘను యుద్ధము ముగిసినతర్వాత ఇంగ్లీషువారు సింధుదేశమును వశపరచుకొనిరి. పూర్వమునుండియు సింధుదేశము అఫ్ఘను అమీరులకు లోబడియుండెను. అఫ్ఘనులతో నింగ్లీషువారు యుద్ధము చేయకమునుపు సింధుదేశపుఅమీరు లింగ్లీషువారితో నొకయొడంబడిక చేసికొని యింగ్లీషువారికి సహాయముజేయుటకొప్పుకొనిరి. కాని దానికి వెంటనే వారు వ్యతిరిక్తముగా సింధుదేశములోనున్న రెసిడెంటును జంపి వారికి సహాయముజేయకుండిరి. కనుక ఎల్లిన్ బరో వారలతో బోరుసలిపి వారినందోడించి సింధుదేశమును 1843 లో స్వాధీనముగావించుకొనెను.

## 16. శిక్కులు—రంజిత్ సింగు

శిక్కులను జాతివారు తొలుత పంజాబులో నివసించియుండిన రాజపుత్రులు. వీరి మతోద్ధారకుడు నానక్. ఇతడు క్రీ. వె. 1468 లో లాహోరునకు సమీపమున 'టాల్బంతి' యను గ్రామమున జన్మించెను. ఇతనితండ్రిపేరు 'కాలు', తల్లిపేరు 'తిపాత'. నానక్ జన్మతనమునుండియు దైవభక్తి తత్పరుడై మతరహస్యములను దెలిసికొన ప్రారంభించుచుండెను. తుదకితడు హిందూముసల్మానుల కనుకూలమగు నొకమతమును గనిపెట్టెను. దీనిపేరు శిక్కుమతము. శిక్కులనగా శిష్యులనియర్థము. ఈమతముప్రకారము దేవుడొక్కడేయనియు, అతడందఱియెడలను సమానదయ జూపుననియు దెలియుచున్నది. ఇట్టి యుపదేశములను విని పంజాబులోని వారు గొందఱు వీని శిష్యులైరి.

ఇట్లుండ కొలదికాలములో నానక్ చనిపోయెను. ఇతని తర్వాత శిక్కులకు తొమ్మండుగురు గురువులువచ్చిరి. వీరిగురువులే వీరికి

రాజులుగనుండిరి. అట్టివారిలో రామదాసు, అర్జునుడు, తెగ్ బహదూర్, గోవిందుడు, పంథర్ మున్నగువారు ప్రధానులు.

ఔరంగజేబుకాలమున శిక్కులనేకవిధముల నతనిచే బాధపెట్టబడిరి. ఏడువందలమంది నితడతిక్రూరముగ జంపించి వారిని లాహోరునొద్ద తగిలివేసెను. ఇంతేగాక రామదాసును, తెగ్ బహదూరును ననేకవిధముల మహమ్మదీయమతములో జేరమని హింసించి తుదకు వారి నురి దీయించెను. తన తండ్రియగు తెగ్ బహదూరు నతడు చంపించినందుకు గురుగోవిందునకు (పదియవ గురువు) మిగుల కోపము వచ్చెను. వెంటనే, అతడనేక శిక్కులను యుద్ధభటులుగ తయారుచేసి, మతము కొఱకు శత్రువులతో పోరుసలుపుట పుణ్యమని బోధించి, అనేక శిక్కుసైన్యములను కొలదికాలములో సమకూర్చెను. అతడు వీరిసహాయమున మహమ్మదీయులను ననేకసారు లోడించెను. తుట్టతుదకు 1708 లో నతడోడిపోవుటచే నతనిని నతనిసంతతివారినిగూడ మహమ్మదీయులు బట్టి చంపివేసిరి. కాని గురుగోవిందుని శిష్యకోటిలో నొకడగు 'బాందా' అనువాడు శిక్కులను తిరుగా జేరదీసి "సిర్ హిండ్" అనుచోట పెక్కండ్రు మహమ్మదీయులను జంపెను. అప్పటి మొగలాయీ చక్రవర్తి యగు బహదూరుషా కీసంగతి తెలియగనే బాందాను బట్టుకొన బ్రయత్నించెను గాని, నతడు తప్పించుకొని పాఱిపోయెను. కాని ఫరక్సియర్ కాలమున నీతడు తన పరివారముతో సహా మిగుల క్రూరముగా జంపబడెను. అతడు యుద్ధమున శిక్కుల రక్షణమునకై పంజాబునం దచ్చటచ్చట కోటలను గట్టించెను.

గురుగోవిందుడు చనిపోయినతర్వాత శిక్కులు కొంతకాలము వఱకు మతమునకై మిగుల పోరాడిరి. వారిలో వారు పదునొకండు గుంపులుగా గూడి ముసల్మానులతో పోరాడుచుండిరి. ఒక్కొక్క గుంపున కొక్కొక సరదారుడుండెను. అట్టినాయకులలో బ్రసిద్ధిగాంచినవాడు రంజత్ సింగు.



ఇతనికి వ్రాయుటయు చదువుటయు తెలియవు. అట్లయ్యును నీతడు మిగుల సామర్థ్యముగలవాడై యుండెను. స్ఫోటకముపడుటచే నీతని ముఖమంతయు మిగుల నందవికారముగ నుండెను. ఇతని కొక కన్ను గ్రుడ్డి. ఇతడు దాంభికుడు కాడు. యుద్ధమందు మిగుల నారితేరినవాడగుటచే నితనికి "పంజాబు సింహము" అని పేరు గలిగెను.

1799 లో ఆఫ్ఘను దేశపురాజు పంజాబుదేశముపై దాడివెడలెను. కాని తన దేశములో శత్రువులు కలహించుటవలన నతడు పంజాబును వదలి వెనుకకు మరలవలసివచ్చెను. అప్పుడతడు పట్టుకొని వెళ్ళజాలని ఫిరంగుల నెవరు కాబూలునకు దెచ్చి యొప్పగించెదరో వారిని లాహోరునకు గవర్నరుగా జేసెదనని ఖరాలుచేసెను. ఈసంగతి విని రంజత్ సింగు ఆఫిరంగులను కాబూలునకు బంపగా నతని నారాజు లాహోరునకు గవర్నరుగా జేసెను.

గవర్నరైనతర్వాత రంజత్ సింగు ఒక సర్దారు కుమార్తెను వివాహమాడి తన మామగారి కితర సంతానము లేకుండుటచే నతని రాజ్యమునుగూడ తానే యేలుచుండెను. పిదప నితడు అమృతసరము, జలంధరు, పెషావరు, ముల్తాను, కాశ్మీరము మొదలగువానిని వశపరచుకొనెను. తుదకు 1806 అగుసరి కీతడు సింధు, సట్లేజు నదులమధ్యనున్న రాజ్యముల నన్నిటిని జయించి యొక గొప్పశిక్కు మహారాజను బిరుదు వహించెను.

రంజత్ సింగుయొక్క శక్తిసామర్థ్యంబులను నతనిసైన్యబలంబునుజూచి యింగ్లీషు గవర్నరు జనరలగు లార్డు మింటో నితనితో నొక యొడంబడిక జేసికొని వానితో స్నేహము గలిగియుండెను. ఇంగ్లీషువారి కిట్టి స్నేహితుడెన్నడును దొరుకలేదు. ముఖ్యముగా నితని సహాయముననే యింగ్లీషువా రాఫ్ఘనుల నోడించి వారి దేశమును వశపరచుకొన గలిగిరి.

## 17. ఇంగ్లీషువారు పంజాబును వశపరచుకొనుట.

పంజాబుసింహమని బిరుదువహించిన రంజత్‌సింగు చనిపోయిన తరువాత దేశమునందల్లకల్లోలములు హెచ్చుగనుండెను. ప్రజలు పాడిపంటలులేక కరువుచే మిక్కిలి బాధపడసాగిరి. రాజు చెప్పినచొప్పున సైన్యము వినుటకు బదులు, సైన్యము చెప్పినటుల రాజే వినవలసివచ్చెను. ఏమనగా రంజత్‌సింగు కుమారుడగు 'ధులిప్‌సింగ్' (Dhulip Singh) పదేండ్లప్రాయముగల బాలుడగుటచే సహజముగా దనతల్లియే రాజ్యమంతయు నేలుచుండెను. ఇతని సరదారులందఱును గలిసి 'ఖలాసా' అను బిరుదువహించి రాజ్యమునందు సర్వాధికారమును వహించియుండిరి. ఇక సైనికులు మిగుల దర్ఫీజాజెందినవారగుటచే రాణీగారును, ఖలాసాయును గలసి వారినణచలేకుండిరి. వారికి దగినపని లేకుండుటచే వారెప్పుడు తమపై దిరుగుబాటుచేసి యంతఃకలహములను గలిగించెదరో యని రాణీగారు భీతిజెందుచుండిరి.

ఇట్లుండ సైనికులు దమంతట తామే సట్లెజునదికి దూర్పుననున్న యింగ్లీషురాజ్యముపై యుద్ధమునకు బోవుదుమని సెలవైనచో బోయెదమని కోరగా రాణీ మున్నగువారందఱును వారిబాధకోర్వజాలక వారు చచ్చిన జత్తురనియు లేనిచో ధనమైనను లభించుననియు దలచి వెంటనే యింగ్లీషువారిపైకి వారినంపిరి.

క్రీ. వె. 1845, డిశంబరు 11 తేదీని శిక్కుసైన్యములు సట్లెజునుదాటి యింగ్లీషువారిరాజ్యమున బ్రవేశించిరి. అప్పటి గవర్నరు జనరలగు హార్డింజప్రభువునకీసంగతి తెలిసినవెంటనే వేలకొలది సైన్యములతో వారి నెదిరింప బ్రయత్నించెను.

లూధియానా, అంబాయినా అనెడి రెండుపట్టణములలోనున్న యింగ్లీషుసైనికులను దీసికొని హార్డింజప్రభువు శిక్కులను 'ముడ్కి' అను స్థలమున నోడించెను. యుద్ధములో జనిపోవగా మిగిలిన శిక్కులందఱును ధైర్యసాహసములను వదలక పౌరుషసీయులై 'ఫిరోజిషా'



అను స్థలమునకు బోయి యచ్చట యింగ్లీషువారిపై యుద్ధముచేయ సిద్ధముగనుండిరి. ఈసంగతి నింగ్లీషువారు తెలిసికొని వారినచ్చట నెదుర్కొనిరి. ఉభయకక్షులవారికిని ఘోరయుద్ధము జరిగెను. పగలంతయు నింగ్లీషువారు బాగుగ బోరాడలేకుండిరి. రాత్రిపడగనే యింగ్లీషువారు పలుచిక్కులలో బడసాగిరి. కాని తెల్లవారినతోడనే యింగ్లీషువారికి శిక్కుసైన్యములలో గలతలు గలిగి పరస్పరవైరములు వారిలో వారికి గలిగెనని తెలిసెను. ఇంతలో వారికి మరికొన్ని యింగ్లీషుసైన్యములు తోడ్పడెను. అందుచే నింగ్లీషువారు శిక్కులను వెంటనే ఓడింపసాగిరి.

కొంతకాలమైనతర్వాత శిక్కులు 'బద్దివాలు' వద్ద నింగ్లీషు నాయకుండగు 'సర్ హెన్రీ స్మిత్' నోడించిరి. ఇందు వారు జయము నొందుటచే 'అలివాలు' వద్ద తిరుగా వాని నెదిరించిరి. ఇప్పటికితడు సైన్యసమేతుడగుటచే వారినచ్చట పూర్తిగ నోడించెను.

శిక్కులకును, ఇంగ్లీషువారికిని యాఖరు యుద్ధము 'సుబ్రహాను' వద్ద జరిగెను. ఈయుద్ధమున శిక్కులు తమధైర్యసాహసముల నెంతగ జూపించినను తుదకు వారికపజయము తప్పినదికాదు. వారు తమప్రాణములను రక్షించుకొనుటకు బారిపోవుచుండ నింగ్లీషువారు వారిని జంపిరి. కనుక ధులిప్‌సింగుమహారాజు వెంటనే ఇంగ్లీషువారితో 1846లో లాహోరువద్ద సంధిజేసికొనెను. ఇందువలన ధులిప్‌సింగు 16 లక్షల పౌను లింగ్లీషువారి కిచ్చుటకును, ఇంగ్లీషురెసిడెంటును లాహోరులో నుంచుకొనుటకును నొప్పుకొనెను. మఱియు సట్లెజు రావీ నదుల మధ్యనున్న ప్రదేశమంతయు నింగ్లీషువారికిచ్చుట కొప్పుకొనెను. ఈ యుద్ధమునే మొదటి శిక్కుయుద్ధమని యందురు (1845-1846) మేజరు లారెన్సు అనువానిని లాహోరునకు రెసిడెంటుగా హార్డింజప్రభువు పంపెను. అచ్చట నతడు కొన్ని యింగ్లీషుసైన్యముల నుంచెను.

మొదటి శిక్కుయుద్ధములో శిక్కులోడినను దిరుగ ధైర్యసాహసములను వహించి ఇంగ్లీషువారితో యుద్ధమునకై తయారుపడిరి.

ఇదియే రెండవశిక్కుయుద్ధము. దీనికి గొన్ని కారణములుగలవు. 1848లో ముల్టానుకు ములార్జు గవర్నరుగా నుండెను. ఇతడు పంజాబురాజునకు సామంతుడు. తాను ఉద్యోగమును గైకొనక బూర్వమతనికి లక్ష 80 వేల రూపాయిలనిచ్చెదనని వాగ్దానము చేసెను. కాని గవర్నరైన పిదప నతడటుల జేయక యితర వర్తకముగూడ చేయుచుండెను. ఎన్నిసారులింగ్లీషువారు రాజునకు ధనమిచ్చివేయుమని కోరినను వారిమాటలను బెడచెవినిబెట్టి తుదకు దన యుద్యోగమును మానుకొనెను. వెంటనే యింగ్లీషువారు 'ఆండర్సన్' అనువానిని ముల్టానునకు గవర్నరుగాబంపిరి. ములార్జు, ఈక్రొత్తగవర్నరు కతిపయపూర్వోశముగ దనపని నప్పజెప్పెను. కాని రాత్రి పడిన తోడనే యతడింగ్లీషువారిపై తిరుగబడి కొందఱిని చంపించెను. అప్పటికి డల్‌హౌసీ ప్రభువు గవర్నరు జనరలయ్యెను. ఇంతలో ననేకులు ములార్జుపక్షమవలంభించి రాజద్రోహులైరి.

కనుక 1848లో డల్‌హౌసీ ప్రభువు 20 వేల సైన్యమును ముల్టానుపైకి బంపెను. వీరు ముల్టానుకోటను స్వాధీనము గావించుకొని 'చిలియన్‌వాలా' (Chillianwala 1849) అనుచోట శిక్కులను దిరుగ నెదుర్కొనిరి. డల్‌హౌసీ యింకొక సైన్యమును గుజరాతుపైకి బంపెను. ఇది 40 వేల శిక్కుసిపాయిల నతిత్వరలో చెల్లాచెదరగు నటుల జేసెను. ఎచ్చటచూచినను శిక్కులోడుట, ఇంగ్లీషువారు జయమునొందుటయే జరుగుచుండెను. ఇంతలో జనరల్ 'గిల్బర్టు' అను యింగ్లీషు సేనానాయకుడు 'రవల్‌పిండి' అనుచోట శిక్కులనోడించి యనేకులను హిమవత్పర్వత ప్రాంతమునకు దగిలివేసెను.

పిదప డల్‌హౌసీ ప్రభువు పంజాబుదేశమునకంతకును నింగ్లీషువారిని సార్వభౌములుగ జేసెను. నాలునకారులక్షలరూపాయిలు ధులీప్‌సింగునకిచ్చుచుండెను. పంజాబునధికారసభవారిచే బరిపాలింపజేసెను. ఇంగ్లీషుపరిపాలన నచ్చట బాగుగ స్థాపించుటకై హెన్రీలారెన్సును జాన్ లారెన్సులను నియమించెను. తొలుత వీరు రాజ్యాధికారముపై దిరుగబాటుసేసిన ముఖ్యులను వారియొక్క జాగీరులనుండి తొలగించిరి. ప్రజలవద్దనున్న యాయుధములను దీసుకొనిరి. రంజిత్‌సింగు భూములపై వేసిన పన్నులను దీసివేసి క్రొత్తగా తక్కువ పన్నులను విధించి తిరుగ భూముల నతుకుబడిసేసిరి. బానిసతనమును దోపిడిని తగ్గించిరి. గొప్పబాటలను వేయించి వ్యవసాయాభివృద్ధికై కాలువలను గొన్ని త్రవ్వించిరి. ఇంతకుముందునుండియు 48 విధములగుబన్నులనుగట్టి బాధపడుచున్న శిక్కులకు జాలపన్నులను దీసివేసిరి. న్యాయస్థానములనేకచోట్లయందు నేర్పరచిరి. గొప్పగొప్ప గ్రామములయందు పాఠశాలలు స్థాపించిరి. ఇంకను నెన్నెన్నియో గొప్పయుపకారములొనర్చి యిరువురు లారెన్సులును పంజాబును నింగ్లీషువారి సుఖపరిపాలనలో నుంచిరి.



## 18. డల్‌హౌసీప్రభువు (క్రీ. శ. 1848-1856.)

ఇతడు 1812 లో స్కాట్లాండులో బుట్టెను. ఇతడింగ్లాండు దేశములోని గొప్పవాడనిపించుకొనిన పురుషశిఖామణి. అచ్చట నీతడు వర్తకవ్యవహారములను సవరించు సభకధ్యక్షునిగానుండి, తన ధైర్య సాహసంబులను గనపరచి, మంచిచెడ్డలను గనుగొను శక్తిగలవాడుగ నుండెను. ఇట్టిమహనీయుని 1848 లో కంపెనీవారు మన దేశమునకు గవర్నరు జనరలుగా బంపిరి.

ఇతడు ప్రజలకెన్నెన్నియో సౌకర్యములు గలుగజేసి యింగ్లీషువారి రాష్ట్రమును సుమారు ప్రస్తుతపుస్థితిలో నుంచెను. ఇతడు పంజాబున కింగ్లీషువారిని సార్వభౌములుగ జేసెనన్న సంగతి మీరు ముందుపాఠములో జదివితిరి. ఇది యిట్లుండ 1852 లో నితనికింకొక వైపునుండి కష్టము సంభవించెను. ఇదియే రెండవబర్మాయుద్ధము. బర్మారాజు తన యిరుగుపొరుగుల నున్నవారినందఱిని జయించి విఱ్ఱవీగుచు 'చైనా రాజునకు బెద్దన్న' యనియు 'రాజరాజు' ననియు

బిరుదులు వహించెను. ఇతడు తన దేశములోనున్న యింగ్లీషువర్తకులను మిగుల బాధపెట్టుచుండెను. తన ముఖ్యపట్టణమందున్న యింగ్లీషు రెసిడెంటును దొలగించుటకు బ్రయత్నించుచుండెను. ఇంగ్లీషువారికీసంగతి తెలిసినతోడనే మార్టబాను, రంగూనులను ముట్టడించిరి. ప్రోమ్ పట్టణమును వశపరచుకొనిరి. పిదప బర్మారాజోడిపోవగనే, డల్‌హౌసీప్రభువు సులభముగ 'పెగురాష్ట్రమును' లోయరుబర్మాను, స్వాధీనము చేసుకొనెను. అప్పటినుండితడింగ్లీషురాజ్యమును దినదినాభివృద్ధి బొందించెను.

ఇక నితడు స్వదేశసంస్థానములమున్నగువానిని జూడ బ్రయత్నించెను. పూర్వమెవరితో నింగ్లీషువారు సంధిచేసికొనిరో, వారందఱును యిప్పటికి జనిపోయిరి. వారికొడుకులో, వారసులో యిప్పుడా రాజ్యములను బరిపాలించుచుండిరి. గాని వారు జ్ఞానవిహీనులగుటచే పద్ధతిప్రకారము పరిపాలింపజాలకుండిరి. వీరు త్రాగుబోతులై ధనమంతయు బ్రావు సిరాజిదౌలావలె వెచ్చించుచు బ్రజలపై నధికములగు బన్నులను వేయుచు వారిని బాధపెట్టుచుండిరి.

డల్‌హౌసీ యిట్టి దురవస్థను జూచి మిగుల దుఃఖించి యొకచిన్న పద్ధతి నేర్పరచెను. పూర్వమునుండియు నపుత్రకులైన రాజులు దాము మరణింపకమున్నే యొకపుత్రుని దత్తతచేసికొను నాచారముండెడిది. కాని, డల్‌హౌసీ యయ్యాచారమునుమార్చి దత్తతచేసికొనుట గూడదనియు, దత్తపుత్రులు ఇంగ్లీషువారి యనుమతిలేక రాజ్యభారమనుభవింప గూడదనియు నేర్పాటుచేసెను. (The Doctrine of Lapse) ఈ చట్టమువలన గ్రమక్రమముగ సంతానములేని స్వదేశ రాజుల రాజ్యములు తుదకింగ్లీషువారి స్వాధీనము లగుచుండెను. ఇట్లింగ్లీషువారి వరిపాలనలో జేరినవానిలో ముఖ్యమైనవి సతారా, నాగపూర్, ఝాన్సీ, (Jhansi) జబ్బల్‌పూర్, ఉదయపూర్ మొదలగునవి. ఇంతియగాక, మఱికొన్ని కారణములచే బీరారు, అయోధ్యయు గూడ నింగ్లీషువారి స్వాధీనమయ్యెను.

1765 లగాయతు అయోధ్యనవాబు ఇంగ్లీషువారితో స్నేహము గలిగియుండె; పిదప వెలస్లీ కాలమున నతని సైన్యసహకారపద్ధతి యొక్క షరతులన్నిటికి నంగీకరించెనుగదా? అట్టి యీ నవాబు తన దేశమును క్రమముగా బాలింపక తుచ్ఛసుఖంబులయందు మునిగియుండెను. ఎన్నిసార్లింగ్లీషువారటుల జేయగూడదని చెప్పినను వారిమాటలను పెడచెవిని బెట్టుచుండెను. కనుక, 1856 లో నయోధ్యనవాబునకు 12 లక్షల రూపాయలు పెన్షనుగ నిచ్చి యతనిరాజ్యమగు నయోధ్యను నింగ్లీషువారి స్వాధీనములోనికి దెచ్చెను.

ఇటుల పరిపాలన బాగులేకపోవుటచే గొన్ని రాజ్యములను, యుద్ధములను జేసి కొన్నిటిని, వారసులు లేకపోవుటచే మరికొన్నిటిని డల్‌హౌసీ ప్రభువు సంపాదించెను.

ఇంగ్లీషు ప్రభుత్వమునకు ప్రాముఖ్యత గలిగించిన యీ డల్‌హౌసీ ప్రభువు ప్రజలబాగుకై మిగుల హెచ్చుగ బాటుపడుచుండెను. ఇతడొనర్చిన సంస్కరణములలో ముఖ్యమైనవానిని గొన్నిటిని మీరిప్పుడు చదువవలసి యున్నది. ఇంతకు పూర్వము ఏయూరిలో పంటలాయూరిలోనే యుండవలసివచ్చెను. ఇందుచే వర్తకులకును నితర ప్రజలకుగూడ చాల నష్టము వచ్చుచుండెను. ఏమనగా పంటలులేని యూళ్ళ కగుమతులు లేనిచో క్షామ మధికముగ నుండెను. పంటలు హెచ్చుగా బండిన యూళ్ళలో నాపంటల నెగుమతిచేయుట కిప్పటి వలె నినుపదారులు లేవు. కనుక డల్‌హౌసీ యినుపదారులతో మన దేశమంతటను వేయించి ప్రజలకు గొప్పలాభము జేసెను. ఇందువలన దేశములో క్షామములు తగ్గి వర్తకులు మున్నగువారనేకులు లాభమును బొందిరి. పిదప తంతివార్తలను గూడ మన దేశములో స్థాపించెను. తపాలాపద్ధతులలో ననేక సవరణములు చేసి అర్ధణా కవరును ప్రాముఖ్యములోనికి దెచ్చెను. ఇందువలన వేలకొలది మైళ్ళలోనున్న వారితోగూడ మనము మాట్లాడుటకు వీలుపడెను. జనసామాన్యమైన యుపచరించెడి పనులను జేయించెడి డిపార్టుమెంటు నొకదానిని స్థాపిం

చెను. వ్యవసాయమునకు, వ్యాపారమునకు నుపకరించెడి కాలువలు, చెరువులు, బావులు మొదలగువానిని ద్రవ్వించెను. ఇదియుంగాక విద్యాభివృద్ధికై యిత డెంతయో పాటుపడెను. ప్రతి గ్రామమున గూడను బడులను బెట్టించి వానిని పరీక్షించుటకై ప్రత్యేకముగ నుద్యోగస్థులను నియమించెను. బొంబాయి, కలకత్తా, కరాచీ, రంగూనులలో హార్బరులను బాగుచేయించి నావలను సురక్షితముగ నుంచుటకు నెన్నెన్నియో సౌకర్యంబులను జేసిన మహనీయు డితడే.

ఇది యిట్లుండ, పొలిమేర సవరణశలయం దింగ్లీషువారికి మహోపకారము లొనర్చిన 'జనరల్ నికాల్సన్' ను గూర్చి మీరు కొద్దిగా నేర్చుకొనవలసి యున్నది. ఇతడు 1822 లో ఢిల్లీలో జన్మించెను. కొలదికాలములో నీత డొక గొప్పయోధు డనిపించుకొనెను. అందుచే నప్పటికి యుద్ధములలో మునిగియున్న యింగ్లీషువా రీతనిని 1839లో నొక నాయకునిగా జేసిరి. ఇంతలో 1840లో ఆఫ్ఘనిస్థానమున కీతడు పోయి నచ్చట ఘోరముగ బోరాడెను గాని, తుద కీతడు వారిచే జెఱబెట్టబడెను. మొదటి ఆఫ్ఘను యుద్ధము ముగిసినతోడనే సంధిప్రకార మితరులతో గూడ నీతడును విడువబడెను. 1845 లోను 1848 లోను నీతడు శిక్కుయుద్ధములలో బోరాడి మిగుల ప్రఖ్యాతి నొందెను. 19. వ పాఠములో మీరు చదువబోయెడి సిపాయీల కలహములో నీత డొనర్చిన పని మిగుల శ్లాఘనీయమైనది. పంజాబు దేశములోనున్న జీలము, అమృతసరము, సియాల్‌కోట అను పట్టణములలో నున్న సిపాయీల నోడించి, రెండువేల సైన్యముతో ఢిల్లీకి బోయెను. అప్పటి కచ్చటయున్న జనరల్ విల్సనుకు తోడ్పడి, ఢిల్లీలో గలహించుచున్న సిపాయీల మూకలనన్నిటిని దఱిమివేసి ఢిల్లీని స్వాధీనము చేసికొనుచుండెడి సమయమున పాపము! ఈతడు ప్రాణములను గోల్పోయెను—



## 19. సిపాయీల కలహము. (క్రీ. శ. 1857)

హిందూదేశములో నీ గొప్పకలహము లార్డు కానింగ్ గవర్నరు జనరలుగా నున్న సమయములో దటస్థించెను. ఇత డిండియాలో నైకమత్యము గలిగించుటకై వచ్చినవారలలో ముఖ్యుడు. కాని యిత డడుగు పెట్టగనే పిడుగు పడినట్లు, సిపాయీలు గలహించి యింగ్లీషు ప్రభుత్వమును నాశనము చేయ సమకట్టిరి.

ఈకలహమున కనేక కారణములు గలవు. అందులో ముఖ్యమైనవి డల్‌హౌసీ ప్రభువు ఎంతయో కష్టపడి మన దేశమునకు జేసిన సంస్కరణములే. అత డయోమార్గములు, తంతి తపాలా పద్ధతులు మున్నగునవి స్థాపించెను. హిందువుల కివి యన్నియు క్రొత్త యేర్పాటులుగ నుండెను. ఎవ్వరికైనను బ్రాతవానిని విడిచి క్రొత్తవాని నభ్యసించుట కొద్దిగా గష్టముగ నుండును గదా! అలాగుననే యీ కాలపు జనులు పూర్వమునుండియు వా రాచరించెడి పద్ధతుల కివి వ్యతిరేకముగా నుండెను. సామాన్యప్రజను లీ క్రొత్త యేర్పాటులను, క్రైస్తవ పాదరీలు చేయు మతబోధనలను గాంచి, దొరతనమువారు తమ మతమును బోగొట్టుటకై యిట్టి యేర్పాటుల నన్నిటిని జేయించిరని తలచుచుండిరి. జనుల కింకొక కారణముచేగూడ వీరి ప్రభుత్వముపై గోపము గలిగెను. అదేమన, దొరతనమువారు విధవవివాహములను, బహుభర్తృకత్వమును (Polygamy) గూడదనియు బద్ధతుల నేర్పరచిరి. ప్రజ లివన్నియు చూచి తమ మత సిద్ధాంతములను బోగొట్టుటకే దొరతనమువారు మన దేశములో నీ క్రొత్త యేర్పాటులను జేసిరని నిశ్చయించి వారిపై పూర్ణముగు ద్వేషమును వహించిరి.

అప్పటికి ప్రపంచమునందంతటయును ప్లాసీయుద్ధమైన (1757) నూరు సంవత్సరములకు (1857) బ్రిటిష్‌రాజ్య మంతమగునని నొక సోదె చెప్పుటగలదు. అట్టిదానిని నమ్మి ప్రజలనేకులు ప్రభుత్వమువారిపై

దిరుగబాటు చేసిరి.

ఇక రాజ్యాంగవిషయములను జూడ ప్రజలును రాజులును బ్రిటిష్వారిని ద్వేషించుచుండిరి. డల్హౌసీ ప్రభువేర్పరచిన క్రొత్తపద్ధతి (Doctrine of Lapse) ప్రకారము రాజ్యమును గోల్పోయిన రాజులనేకులుండిరి. వెల్లస్లీ ప్రభువేర్పరచిన 'సైన్యసహకారపద్ధతి' వలన స్వదేశరాజులవద్దనుండి అనేక సిపాయీలు తమ పదవుల నుండి తొలగింపబడిరి. ఇదియునుగాక మొగలాయి చక్రవర్తియగు బహదూరుషాను దొరతనపువారికమీద ఢిల్లీలో నివసింపగూడదని యాజ్ఞాపించిరి. బహదూరుషాభార్య యందుపై మిగుల గోపము జెంది యింగ్లీషువారితో గలహించుటకు బ్రారంభించెను. నిష్కారణముగ దమ దేశము నింగ్లీషువారు గైకొనెదరని యయోధ్యలోని జనులందఱు గూడ గలహింప నారంభించిరి.

పూర్వమునుండియు హిందువులు సముద్రమును దాటుట పాపమని యనుకొనుచుండిరి. అట్టి యాచారమునకు విరుద్ధముగా నిప్పుడింగ్లీషువారు తమ సైనికులకు బనిపట్టినప్పుడెల్ల సముద్రప్రయాణము సేయవలయునని శాసించిరి. మఱియు సైనికులకిచ్చెడి జీతము లతిస్వల్పముగా నుండెను. ఇంతేగాక యుద్ధములలో వారికిచ్చెడి బత్తా లతిస్వల్పముగా నుండెను. మఱియు యుద్ధములలో వారికిచ్చెడి తోటాలకు ఆవుక్రొవ్వును, పందిక్రొవ్వును బూయబడి యున్నట్లుల వారికి దెలియవచ్చెను. కనుక హిందూమహమ్మదీయ సిపాయీలు వానిని ముట్టుకొనమని పేచీపెట్టి కలహింపసాగిరి. (1857)

తొలుత 'మీరట్' అను పట్టణమున నీకలహము ప్రారంభమయ్యెను. అచ్చట సిపాయిలందఱును నింగ్లీషు యుద్యోగస్థులపై దిరుగబడి వారిని జంపి, వారిండ్లనన్నిటిని గాల్చి, ఆపట్టణమందున్న చెఱసాలను బగులగొట్టి ఖైదీలనందఱిని విడిపించి, ఢిల్లీకి బోయిరి. అచ్చట వీరు బహదూరుషాను దిరుగ ఢిల్లీ చక్రవర్తిగ జేసిరి. ఇటుల నొకచోటున నీకలహము ప్రారంభము గాగానే యింకొకచోటనున్న



సిపాయీలు గలహింపసాగిరి.

కాన్పూరునకు గొలది దూరములో నున్న బిఠూరునందు రెండవ బాజీరావుయొక్క దత్తపుత్రుడగు 'నానాసాహెబు' నకు ఇంతవఱకింగ్లీషువారిచ్చుచుండెడి పెన్షనును, అతడు చనిపోవగానే, వారు మాని వేయుటచే, వారిపై కోపముగలిగి టాంటియాటోపీ అను వానిని సహాయముగ జేసికొని హఠాత్తుగ కాన్పూరులోనున్న యింగ్లీషువారిని హేవలక్ అనువారలు వినినతోడనే యింగ్లీషునాయకులగు 'నెయిల్'; జంపించెను. ఈసంగతిని కాన్పూరునకుబోయి నానాసాహెబు నోడించి, కాన్పూరు పట్టణమును స్వాధీనము జేసుకొనిరి.

అయోధ్యకు ముఖ్యపట్టణమగు 'లక్నో' యందును గూడ సిపాయీలు కలహింపదొడగిరి. ఈసంగతి నచ్చటయున్న యింగ్లీషు రెసిడెంటగు 'హెన్రీలారెన్సు' అనువానికి దెలసినతోడనే యుద్ధభటులను బంపి కలహకారులను దరిమివేయించెను. కొలదిరోజులకే నా రెసిడెంటు చనిపోవుటచే హేవలక్ మున్నగువారు కలహకారుల నావలకు బంపిరి.

పంజాబులోనున్న జాన్లారెన్సు తన గొప్పసైన్యములతోవచ్చి ఢిల్లీలో గలహించుచున్న సిపాయీలతో నారుదినములు పోరాడి వారిని యుద్ధములో నోడించెను. యుద్ధములోనోడిన సిపాయీలందఱును చెల్లాచెదరై పాఱిపోయిరి. లారెన్సు బహదూరుషాను నతని కుమారులను ఖైదీలుగ దీసికొని, ఢిల్లీ నింగ్లీషువారి వశము జేసెను.

ఈ మూడుస్థలములలోనేగాక యితర స్థలములలో గూడ నిట్టి సిపాయీల కలహములుబుట్టెను. అట్టివానిలో పంజాబు, అయోధ్య, లక్నో, అలహాబాదు, ఝాన్సీ, గ్వాలియరులు ముఖ్యమైనవి. (పటమును జూడుడు) వీరలకు హెచ్చుగ సహాయమున్ను జేయుచుండిన వారిలో ప్రధములు మహారాష్ట్రనాయకుండగు టాంటియాటోపీ, ఝాన్సీదేశపు రాణీ, నానాసాహెబు మున్నగువారు. టాంటియాటోపీ కాన్పూరు మున్నగు ప్రదేశములలోనున్న సిపాయీలకు సహా

యుద్ధ యుండెను. కాని తుదకాతడింగ్లీషువారికి దొరకుటచే నురి దీయబడెను. ప్రారంభమైన రెండేండ్లలో నీసిపాయీల కలహము ముగింపబడెను.

సిపాయీలు కలహించిన ముఖ్యస్థలములు.




ఈకలహమువలన యింగ్లీషువారికి దమ ముఖ్యస్నేహితులెవ్వరో వారెటులనుందురో బాగుగా దెలిసెను. ఇందువలన ఈస్టిండియా కంపెనీవారి పరిపాలన గూడ నంతమయ్యెను.

## 20. విక్టోరియా మహారాణి.

1600 లో స్థాపింపబడిన ఈస్టిండియాకంపెనీవారికి ఎలిజబెత్తు రాణీగారిచ్చిన శాసనపత్రికనుగూర్చి మీరు చదివియేయున్నారు కదా! అట్టి యీశాసనము శాశ్వతమైనది కాకుండుటచే మార్పులనేకములను పొందవలసివచ్చెను. అట్టివానిలో గొప్పది 1813 లో బొందెను.



ఇందువలన ఇండియాతో వీరొక్కరేగాక యిచ్చవచ్చిన యూరోపియనులందఱును వర్తకము చేసికొనుటకు వీలుకలిగెను. మఱి యిరువది సంవత్సరములకు (1833) పార్లమెంటువారు తిరిగా యీపత్రములో గొన్ని మార్పులను గలిగించిరి. అప్పటినుండి కంపెనీవారు తమ వర్తకమును మాని [illegible] సంఘము వారైరి. ఇందువలన ప్రతి యూరోపియనునకు [illegible]యాతోను దానికి సంబంధించిన దీవులతోను వర్తకము చేసికొని ధనమార్జింప గలుగుటకు వీలుగలిగెను. కాలక్రమమున పార్లమెంటువారు కంపెనీవారి పరిపాలన విషయములో వారిపై విచారణ చేయగలిగెడి 'బోర్డు ఆఫ్ కంట్రోల్' అను నొకసభ నేర్పరచిరి.

ముందుపాఠములో మీరు చదివిన సిపాయీల కలహము కేవలము తూర్పుఇండియా సంఘమువారి చెడు పరిపాలనవలననే గలిగెనని యింగ్లీషువారందఱును దలచిరి. మఱియు వర్తకసంఘమువారు పరిపాలకులుగా నుండుట మిగుల శ్రేష్ఠముగాదని యింగ్లాండులోనున్న పార్లమెంటువా రూహించుచుండిరి. కనుక 1858 లో పార్లమెంటువారొక చట్టమును నిర్మించిరి. ఇందువలన దొరతనమువారు కంపెనీవారియొద్దనుండి యిండియా పరిపాలనావిషయముల నన్నిటిని గైకొనిరి. అప్పటినుండి 1600 లో స్థాపింపబడిన ఈస్టిండియా కంపెనీవారి పాలనము ముగిసెను. ఇంగ్లాండు నేలెడి రాజులే మన దేశమునకు జక్రవర్తులగుచుండిరి. మన పంచమ జార్జి చక్రవర్తిగారి పితామహియగు విక్టోరియా మహారాణిగారు మన దేశమును మొట్టమొదట కంపెనీవారి పాలనమునుండి తప్పించి తమ యేలుబడిలోనికి దెచ్చుకొనిరి.

ఇంగ్లాండునుండి వారు మన దేశమునకు వచ్చి పరిపాలన చేయుట వీలులేదు గనుక పైచట్టము మఱికొన్ని మార్పులను గూడ గలిగించెను. ఈమెకాలమునుండి హిందూదేశమును బాలించుటకై 'రాజ ప్రతినిధి' (Viceroy) యొకడు నియమింప బడెను. ఇతడైదేండ్ల కొకసారి చక్రవర్తిగారిచే నియమింపబడును. ఇతడెట్లు పరి

పాలన చేయుచున్నాడో చెప్పుటకును, మన దేశపు బరిపాలనలో గావలె
సిన సలహాలను చక్రవర్తిగారి కిచ్చుటకును "ఇండియా మంత్రి"
(Secretary of State for India) నొకని నుంచిరి. ఇతడు రెండు
మూడేండ్ల కొకసారి మారుచుండును. ఇతని సహాయమునకై లండను
లో 'ఇండియా సభ' (The India Council) యొకటి యున్నది.
ఇందు సభ్యులు ఇండియాను బాగుగ నెఱిగిన యింగ్లీషువారును,
హిందువులు గొందఱును గలసి 15 గు రున్నారు. ఇండియాపై నధికా
రము గలవారు పార్లమెంటువారు.

ఉదార ధీమంతురాలగు విక్టోరియా మహారాణీగారు 1858,
నవంబరు 1 తేదీని రాజశాసన మొకటి ప్రకటించి యిండియాకు బం
పిరి. దీని నప్పటి రాజ ప్రతినిధియగు కానింగు దేశభాషలలోనికి
దర్జుమా చేయించి మన దేశమందున్న గొప్పగొప్ప పట్టణములందు
గవర్నమెంటు ఉద్యోగస్థులచే జదివించెను. అది యేమన—కంపెనీ
వారి పరిపాలన యింతటితో ముగిసిననియు, నద్దానిని ప్రభుత్వము
వారు (Crown) గైకొనిరనియు, వారు దేశస్థుల మత విషయములను
గూర్చి నెట్టి జోక్యమును గలుగజేసికొనరనియు, ప్రజలు వారి యిచ్ఛ
వచ్చిన మతముల నవలంభింప వచ్చుననియు, నప్పటికే నిల్చియున్న
యొడంబడికలు, (Treaties) హక్కులు, ఆచారములు మున్నగు
వానిని ఖాయపరచడ మైననియు, సిపాయీల పితూరీలో జేరినను
ఇంగ్లీషువారిని హత్యగావింపని వారినందఱిని రక్షించెదమనియు; ఇంకను
నన్ని యీ మహోపకారంబులకు రాజభక్తిగల హిందువులు పొంద
గలరనియు, వారి విద్యకును సామర్థ్యంబునకును దగినట్లు దొరతనమువా
రుద్యోగముల నిచ్చెదరనియు, నీప్రకటనవలన స్పష్టపడుచున్నది.

ఈ ప్రకటనవలన దేశములోనున్న క్షోభను కానింగు ప్రభు
వశపగలిగెను. తానెన్ని కష్టములు వడినను నుత్సాహముతో బని
చేయుచునే యుండెను. అందుచేతనే యితనిని దయామయుడని
యందురు. (Clemency Canning)



## 21. ఇండియాలో ప్రతినిధుల పరిపాలన

రాజ ప్రతినిధులచే నిండియా, విక్టోరియా మహారాణీగారి
కాలము మొదలు, నేటివఱకును బరిపాలింపబడుచున్నది. వీరిలో
మొదట వచ్చినవారు లార్డు కానింగ్. వీరైదేండ్ల కొకసారి నియ
మింప బడుట చేతను, వీరి పరిపాలనలనుగూర్చి చక్రవర్తిగారితో జెప్పుట
కేర్పడిన 'ఇండియా మంత్రి' రెండు మూడేండ్ల కొకసారి మారుచుం
డుట చేతను, ఇండియా, వీరి కాలములో బాగుపడ వలసినంత వఱకు
బాగుపడ లేదు. వీరి పరిపాలనలలో మీరు నేర్చుకొనవలసిన ముఖ్యాం
శములు రెండు గలవు. అవి యేమన—వీరెట్టుల మన దేశమునకు
శత్రుభయము లేకుండ సరిహద్దులను బలపరచిరో, వారు మన దేశ
మున కొనర్చిన క్రొత్త సంస్కరణము లెవ్వియో మీరిక జదువ వలసి
యున్నది.

i. <u>పొలిమేరలను రక్షించుట</u>:—ఈ సంగతిని గూర్చి మీరు
కొద్దిగ 15. వ పాఠములో నేర్చుకొనియే యున్నారు. రష్యావారితో
ఆఫ్ఘను లేకీభవించినచో, మన దేశమును గాపాడుట మిక్కిలి కష్ట
మని యింగ్లీషువారాలోచించి, ఆఫ్ఘనులపై దాడివెడలిరిగదా!
అప్పటినుండియు నింగ్లీషువారి దృష్టి సర్వదా ఆఫ్ఘనిస్థానమందే
నిలచి యుండెను.

క్రీ. వె. 1864 లో రాజ ప్రతినిధిగ నియమింప బడిన సర్
జాన్ లారెన్సు ఆఫ్ఘనులతో యుద్ధము జేయవలసివచ్చెను. ఆఫ్ఘను
అమీరగు దొస్తు మహమ్మద్ చనిపోయినతోడనే యతని కుమారు
లగు అఫ్జుల్ ఖాన్ షర్ ఆలీ, అనువారు, తమలో దాము సింహాస
నమునకై దెబ్బలాడుకొన సాగిరి. ఆ దెబ్బలాటలలో షర్ ఆలీ ఓడి
పోయి కందహారమునకు బాఱిపోయెను. అచ్చట నతడింగ్లీషువారి
సహాయము నపేక్షించెనుగాని, లారెన్సు అందుల కిష్టపడ లేదు.




అప్పటినుండియు షర్ ఆలీ, ఇంగ్లీషువారిపై ద్వేషము వహించెను. ఒకానొకప్పు డతడు ఆఫ్ఘనిస్థానమున కమీరగునప్పుడు తన కింగ్లీషువారిపై నుండు ద్వేషమునంతయు జూప నెంచెను. ఆసమయముననే ఇంగ్లీషువారు బొలాన్ త్రోవ ముఖద్వారమందున్న 'క్వెట్టా' అను స్థలమును మట్టడిచేయుట తటస్థించెను. ఈసంగతి షర్ ఆలీకి దెలిసినవెంటనే రష్యారాజుతో స్నేహము జేసి, ఇంగ్లీషువారి నోడించుటకు బ్రయత్నింపసాగెను. ఇదియే రెండవ ఆఫ్ఘన్ యుద్ధము.

ఈయుద్ధము ప్రారంభమగుసరికి, హిందూదేశమును బరిపాలించుచుండిన రాజ ప్రతినిధి, లార్డు లిట్టను. ఇతడు మొదట సంధి జేసికొన నిశ్చయించి, రాయబారి నంపెనుగాని, షర్ ఆలీ యందుల కామోదింపనందున, నొక గొప్ప సైన్యమును 1878 లో ఆఫ్ఘనిస్థానముపైకి బంపెను. ఆసంవత్సరముననే రష్యావారికిని, ఇంగ్లీషువారికిని యూరపులో యుద్ధము జరుగుచుండుటవలన, రష్యావారు షర్ ఆలీకి దప్పక సహాయము జేయవలసివచ్చెను. ఇంగ్లీషువారు జలాలాబాద్, కందహారులను స్వాధీనము జేసికొనినతోడనే, షర్ ఆలీ యుద్ధభూమిని వదలి పారిపోయెను. అతడు చనిపోయిన తరువాత, నతని కుమారుడగు యాకూబ్ ఖానును ఇంగ్లీషువా రమీరుగ జేసిరి. కాబూలులో నొక యింగ్లీషు రెసిడెంటు నుంచిరి.



కాని, ఆఫ్ఘనులకు బరదేశస్థులు తమపై నధికారమును వహించుట యించుకైన నిష్టములేకుండెను. అందుచే బూర్వమువలె నప్పటికి గాబూలులో నున్న యింగ్లీషు రెసిడెంటును జంపిరి. అందు కింగ్లీషువారు కోపోద్రిక్తులై వారిపై యుద్ధమునకు వెడలిరి. ఇదియే మూడవ ఆఫ్ఘన్ యుద్ధము.

ఇది 1879 మొదలు 1881 వరకును జరిగెను. లార్డు రాబర్ట్సు అను నతడు కాబూలును ముట్టడించి, దానిని వశపరుచుకొనెను. సర్ డొనాల్డు స్టీవర్టు అను నాంగ్లేయ సైన్యాధిపతి 'అహమద్ ఖేల్' అనుచోట ఆఫ్ఘనులను బూర్తిగ నోడించి, యాకూబ్ ఖానుని కలకత్తాకు ఖైదీగ దీసికొని పోయెను. ఇందువలన ఆఫ్ఘనులు కొంచెంత చెలరేగిరి. ఇట్టిసమయమున లిట్టను ప్రభువు పోయి, రిప్పన్ ప్రభువు మన దేశమునకు గవర్నరు జనరలయ్యెను. ఇతడు వచ్చినతోడనే షర్ ఆలీయొక్క అన్న కుమారుడగు అబ్దుల్ రహమాన్ అను వానిని కాబూలునకు అమీరుగ జేసెను. ఇత డింగ్లీషువా రెటుల జెప్పినటు లేనడచుకొనుచుండెను. ఇతడు 1907 లో జనిపోయెను. ఈ సంవత్సరముననే, యింగ్లీషువారు రష్యావారితో సంధి కొడంబడి ఆఫ్ఘనిస్థానమును నుత్తర సరిహద్దుగ నిర్ణయించుకొనిరి.

ఆఫ్ఘనిస్థానమును వశపరచుకొనిన తరువాత ప్రస్తుతము బశ్చిమోత్తర పరగణాలని పిలువబడు రాష్ట్రములనుగూడ, నింగ్లీషువారు స్వాధీనము గావించుకొనిరి. పూర్వమీ రాష్ట్రములయం దొకవిధమగు నడవి జాతివారు నివసించుచుండిరి. వీరల నింగ్లీషువా రణచి, సదరు రాష్ట్రములను స్వాధీనము జేసికొని యచ్చట గొప్ప గొప్ప కోటలను, బాటలను, ఇనుపదారులను వేయించిరి. వానిని బాలించుటకై ప్రత్యేకముగ నొక కమిషనర్ను నచ్చట నుంచిరి.

1884 లో రిప్పన్ ప్రభువు మన దేశమునుండి వెడలిపోగా, లార్డు డఫిన్ అను నతడు రాజ ప్రతినిధిగా బంపబడెను. ఇతని కాలములో మూడవ బర్మాయుద్ధము దటస్థించెను. డల్ హౌసీ ప్రభువు

కాలమున రెండవ బర్మాయుద్ధము జరిగెనన్న సంగతి మీకు దెలిసియే యున్నది. ఇంగ్లీషువారు పెగు, ప్రోమి మున్నగు స్థలములను వశపఱచుకొనిరి. బర్మారాజునకు అప్పరు బర్మామాత్ర మిచ్చిరి. అతడు రానురాను తన రాజ్యములోనున్న యింగ్లీషు వర్తకులతో నెల్లప్పుడును దెబ్బలాడుచు రాజ్యపరిపాలన బాగుగా జేయకుండెను. ఇంగ్లీషువారీ సంగతిని విని 1886 లో నతనిని సింహాసనమునుండి తొలగించి బర్మా రాజ్యము నంతయు స్వాధీనము చేసుకొనిరి. 1897 మొదలు నేటికిని ప్రభుత్వమువారు బర్మా నొక లెఫ్టెనెంటు గవర్నరుచే బరిపాలింప జేయుచున్నారు.

## —♦ రాజప్రతినిధులు మన కొనర్చిన సంస్కరణములు ♦—

క్షామమును బాపుట:—ఏ సంవత్సరములలో వ్యవసాయములు పాడయి పంటలు లేకుండునో యట్టి సంవత్సరములకే కరువు సంవత్సరములని యందుము. తరుచుగా మనవారు వానిని గుడికట్టు సంవత్సరములని యందురు. ఇట్టివానిలో హేవళంబి, విళంబి, వికారి మున్నగునవి ముఖ్యమైనవి.

ఇట్టి కరవుకాలములలో రహితుల బాధలు హెచ్చుగ నుండును. వారికి మూలధనమును ముఖ్యజీవనమును నగు వ్యవసాయము నశించుటచే వారి కప్పిచ్చు వర్తకులుగూడ వెనుకదీయుదురు. వారివద్ద డబ్బున్నంతవఱకును ఖర్చుపెట్టుకొని తరువాత డబ్బులేమిచే దొంగతనము మొదలగు దుర్వృత్తుల నవలంభింతురు.

ఈశాన్యమునందుండి వచ్చెడి మాన్సూను గాలులు మనదేశముపై వీవకుండుటచే 1876 లో చెన్నరాజధాని, హైదరాబాదు, మైసూరు మున్నగు రాజ్యములలో నొక గొప్ప కరవు సంభవించెను. 1877 లో పశ్చిమోత్తర రాజ్యములందును, పంజాబుదేశమందును, 1897 లో మధ్య పరగణాల యందును, అగ్రా అయోధ్య ఐక్యరాష్ట్రముల యందును గొప్ప క్షామములు గలిగెను.



కనుక క్షామములను బాపుటకు 'లార్డు కర్జన్' ప్రభువును దొరతనమువారు 1899 లో మన దేశమునకు వైస్రాయిగ బంపిరి. ఇతడు వచ్చినతోడనే సహాయధనమును (Relief Fund) జమచేసి దానిని బీదలకొసంగి క్షామమును గొంతవఱకు దగ్గించెను. వేలకొలది మైళ్ళవఱకు నినుపదారులను వేయించి క్షామముతో బాధపడుచుండెడి జిల్లాలకు బంట లధికముగా బండిన జిల్లాలనుండి యెగుమతులు చేయించెను. కూలిపని చేయగలిగినవారి కట్టి పనులను జూపి కూలి యిప్పించుచుండెను. పిల్లలకు, రోగులకు, ముసలివాండ్రకు ధర్మము నిమిత్తము 150 లక్షల రూపాయీలను బ్రత్యేకముగ నుంచి యద్దానిని వారిక్రింద ఖర్చు పెట్టించుచుండెను.

ప్రభుత్వమువారు మఱికొన్ని సౌకర్యములను గూడ నితని కాలములో జేయించి క్షామమును బోగొట్టిరి. వ్యవసాయాభివృద్ధికై కాలువలు, చెరువులు, నూతులు మున్నగువానిని ద్రవ్వించిరి. శిస్తులు జాస్తీచేయుట మానిరి. రహితుల నిచ్చవచ్చినపుడెల్ల దొలగించుటకు వీలులేదని శాసించిరి. పైని నుడివిన సౌకర్యంబుల నన్నిటిని జేసి ప్రభుత్వమువారు కరవును మాన్పిరి.

## —♦ ii. పరిపాలనలో గలిగిన మార్పులు ♦—

20. వ పాఠములో రాజప్రతినిధుల నెవరు నిర్మించెదరో మీరు చదివి యున్నారు. అట్టి రాజప్రతినిధుల కిప్పుడు సలహాయిచ్చుటకై కార్య నిర్వాహక సభ (Executive Council) యొకటి నిర్మింపబడెను. తొలుత నీసభయందు నలుగురు యూరోపియనులు సభ్యులుగ నుండిరి. కాని కొన్ని కారణములచే బ్రస్తుతము 8 గురు సభ్యులున్నారు. రాజునకు మంత్రులెట్లుండుదురో, అలాగుననే రాజప్రతినిధికి వీరట్లుండిరి. ఈ సభ్యులను రాజప్రతినిధియొక్క మంత్రులని యందురు.

ఇట్టి మంత్రిపదవులలో నెవ్వరుండిన, మన దేశమునకును, మన

కును క్షేమముగలుగునో, మీరాలోచింపుడు. న్యాయముగా వీరిలో గొందఱైనను మన దేశస్థులై యున్నచో, మనకు లాభకరముగ నుండును. ఏలయన, వీరు మనబాధలను బాగుగ నెఱింగి, వానిని సభవారి కెఱింగించి తగిన నివారణ చేయించెదరు. కాని, యట్టి లాభమును దొలుత, మనవారికివ్వనందున, లార్డు డఫ్రిన్ కాలమున (1885)లో మన వారిలో గొందఱు, ముఖ్యులు గలసి దేశీయమహాజనసభ (The Indian National Congress) యొకటి నేర్పరచి కార్యనిర్వాహక సభయందు ప్రజల పక్షమువారు గూడ గొంద ఱుండవలెనని వాదించిరి. అందుపై దొరతనమువా రాలోచించి, తుదకు 1909 లో, హిందువు నొకనిని మంత్రిగ నియమించిరి. కాలక్రమమున, అనగా 1919 లో నీ సభవారిలో ముగ్గురు హైందవులై యుండిరి. నేటివరకును నీరీతిగనే జరుగుచున్నది.

మన దేశమును విక్టోరియా మహారాణీగారు పరిపాలించుట మొదలిడునరికి, నాలుగు రాజధానులుగ దేశమంతయు భాగింపబడి యుండెను. ఇవియే బంగాళము, ఆగ్రా, బొంబాయి, చెన్నపట్టణములు. ఒక్కొక్కటియొక్కొక్క గవర్నరుచే బరిపాలింపబడుచుండెను. శేషించిన భాగమును రాజప్రతినిధి పాలించుచుండెను. ఇంత గొప్పభాగమా నొక్కడు పాలించుట యించుక గష్టముగ నుండుటచే బర్మా, అస్సాము, మధ్యపరగణాలు, పంజాబులక్రింద విభజించిరి. వీనిని బరిపాలించుటకై గవర్నరులను, లెఫ్టెనెంటు గవర్నరులును, చీఫ్ కమీషనర్లను గొందఱును నియమించిరి. మొదట ఇంగ్లీషువారే పైని జెప్పబడిన యొద్యోగములను గైకొనుచుండిరి. కాలక్రమమున హిందువులను గూడ ప్రభుత్వమువారు గవర్నరులుగ జేసియున్నారు. అట్టి హిందూ గవర్నరులలో బ్రసిద్ధిగాంచిన సిన్హా ప్రభువుగారు ముఖ్యులు.

గవర్నరులే పూర్వము తమతమ కార్యనిర్వాహక సభవారియొక్క ఆలోచనల నంది, చట్టములను నిర్మించుచుండిరి. గాని వీరటుల నేర్పరచిన చట్టములు ప్రజల కెంతమాత్రమును లాభములను గలిగింప



కుండెననుట నిస్సంశయము. ఏమనగా మన సుఖదుఃఖములు వీరలకు బాగుగ దెలియకుండెను. కావున పార్లమెంటువారీ సంగతుల నన్నిటిని బాగుగ నాలోచించి తుదకు 1861 లో సామ్రాజ్యశాసనసభ (Imperial Legislative Council) నొకదానిని, రాష్ట్రీయ శాసనసభ నొకదానిని, ప్రతి రాజధానియందును నిర్మించిరి. మొదటిదానిలో రాజప్రతినిధియు, నతని మంత్రులును, మఱికొంద ఱుద్యోగస్థులును దగుమనుష్యులును గూడ సభ్యులుగ నుండిరి. రెండవదానిలో గవర్నరు అధ్యక్షునిగ నుండి, తన మంత్రులతోను, ఉద్యోగస్థులతోను, ఇతర తగుమనుష్యులతోను గూడి, ప్రతివిషయమును సభలో జర్చించుచుండును. పూర్వము పై రెండు సభలలోని సభ్యులను ప్రభుత్వమువారే నియమించుచుండిరి. అట్టి సభ్యుల నెంచుకొనెడి హక్కులను మనకిప్పుడు ప్రభుత్వమువారిచ్చియున్నారు. ఈ సభవారెట్లు చెప్పిన నట్లే ప్రభుత్వమువారు నడచుకొనవలెను.

## 22. ప్రభుత్వమువారికిని స్వదేశరాజులకును గల సంబంధము.

తొలుత నీరీసంబంధము దెలిసికొనకపూర్వము స్వదేశ సంస్థానపు బ్రజలకును మనకును గల భేదము గనుగొనవలెను. ఈసంస్థానములోని ప్రజలు మనవలెగాక, అనగా మన దొరతనపువారు నిర్మించు పద్ధతుల ననుసరింపక, తమతమ సంస్థానాధీశులు నిర్మించు పద్ధతుల ననుసరించియుందురు. ఇదియే వారికిని మనకును గల ముఖ్యభేదము.

మన దొరతనమువారు స్వదేశరాజుల నెట్లు చూచుచుండిరో మీకిదివఱకు దెలిసియేయున్నది. ఈసంబంధమెల్లప్పుడు నొక్కరీతిగ నుండక క్రమక్రమముగ మారుచునే యున్నది. వారన్ హేస్టింగ్సు కాలమున హైదరాలీయును, వెలస్లీకాలమున భోన్స్లే, సింధియా, హోల్కారులును మిక్కిలి స్వాతంత్ర్యము గలిగియుండి, ప్రభుత్వము వారి నెదిరింప సమర్థులుగ నుండిరి. కాని ప్రభుత్వమువా రట్టివారి

నెల్లప్పుడును నణగద్రొక్కుటకు బ్రయత్నింపలేము. వారివలన బాధ
గలిగినప్పుడు మాత్రమే వారితో యుద్ధములు చేసి వారినణచుచుండిరి.
మఱియు మొదటినుండియు తూర్పిండియా సంఘమువారు స్వదేశ
రాజులతో నెట్టిజోక్యమును గలిగించుకొనగూడదని వారు మన దేశము
నకు బంపెడి గవర్నరు జనరలులకు జెప్పుచుండిరి. ఈసంగతి మీరు
'సర్ జాన్ షోర్'ను గూర్చి నేర్చుకొనినప్పుడు చదివియున్నారు.

కాని యతని తరువాత వచ్చిన వెలస్లీప్రభువట్లు చేయక స్వదేశ
రాజులను ప్రభుత్వమువారికి లోబడునటుల తన సైన్యసహకార పద్ధతి
నేర్పరచెను. ఈపద్ధతియొక్క షరతులు మీకు దెలిసియేయున్నవి.
అతడాషరతుల కొప్పుకొనని స్వదేశరాజులతో యుద్ధములుచేసి యందు
లకు వారొప్పుకొనునటుల జేయుచుండెను. ఇందువలన నతడు వారి
బాహ్య స్వాతంత్ర్యమును దీసివేసెను. ఇతని తరువాత వచ్చిన గవర్నరు
జనరలులు, ప్రజలను బాగుగా బరిపాలింపలేని స్వదేశ రాజులవద్ద
నుండి, వారివారి రాజ్యములను స్వాధీనము చేసుకొనుచుండిరి. బెం
టింకుప్రభువు మైసూరు కొడగు రాజ్యములను; డల్‌హౌసీ, నాగ
పూరు, అయోధ్య, సతారా మొదలగువానిని వశపఱచుకొనెను.

కాని 1857 లో జరిగిన సిపాయిల కలహమున దొరతనము
వారికి స్వదేశరాజులలో గొందఱు సహాయముచేయుటచే, నటుతరు
వాత మన దేశమునకు రాణిగా వచ్చిన విక్టోరియా మహారాణీగారు,
డల్‌హౌసీ కాలములోనున్న స్వదేశరాజులు ఇంగ్లీషువారి యనుమతి
లేకుండ, దత్తము జరిగించుకొనగూడదను బద్ధతిని దీసివేసిరి. ఆమె యొక్క
రాజశాసనమును బ్రకటించి యద్దానిని దేశభాషలలోనికి తర్జుమా
చేయించి మనదేశమందంతటను జదివించినటుల మీరు చదివితిరిగదా!
అందువలన రాజులకును బ్రజలకును ననేకలాభములు గలిగెను.

ప్రభుత్వమువారు పూర్వమునుండియు బాగుగా బరిపాలింప
లేని స్వదేశరాజులకు దమ రెసిడెంటులను సహాయముగ బంపు
చుండిరి. అప్పటికిని నారాజులు వీరిమాటలను చెవిని బెట్టినచో



బట్టి వారిని సింహాసనమునుండి తొలగించి వారివంశములో నొకని
కారాజ్యము నిచ్చుచున్నారు. ఇందు కుదాహరణముగా బూర్వము
ప్రభుత్వమువారికి యుద్ధములవలన దఖలుపడిన మైసూరును దిరుగ
వారు 1831 లో మైసూరురాజున కిచ్చివేసిరి. కనుక మన ప్రభుత్వము
వారు స్వదేశరాజులపై నెల్లప్పుడును గరుణ గలిగి వారి క్షేమమే
తమ క్షేమమని తలంచుచుండిరి.

ప్రస్తుతము రైలుమార్గములు, తంతి తపాలామార్గములు, జలాధా
రములు మున్నగునవి నిర్మించునపుడు స్వదేశరాజులు ప్రభుత్వము
వారితో గలసి జరిగింపవలెను. యుద్ధకాలమందు వారు దొరతనము
వారికి సహాయ మొసగవలెను. ఎన్నడును విదేశీయులతో వారికెట్టి
సంబంధము నుండరాదు. ఒకవేళ నితరరాజులతో వారికెట్టి వివాద
మున్నను, వారద్దానిని ప్రభుత్వమువారిమూలమున బరిష్కరించుకొన
వలెను. ఇట్లు వీరు నడచుకొనిన ప్రభుత్వమువారు వారికెల్లప్పుడును
రక్షించెదరు.

కనుక 1858 మొదలు నేటివఱకును స్వదేశసంస్థానములవారం
దరును మన ప్రభుత్వమువారియెడల మిగుల స్నేహభావము గలిగి
యున్నారు. ప్రభుత్వమువారు గూడ వారిపై నట్టిభావమే గలిగి
యున్నారు.

## 23. ప్రస్తుత పరిపాలనాస్థితి.

ప్రస్తుతపు పరిపాలనమును గూర్చి కొద్దిగ మీరు 20. వ పాఠ
ములో జదివియే యున్నారు. మన దొరతనమువారి పరిపాలనా నిర్మా
ణము మానవుని శరీరమును బోలియున్నది. మనశరీరమందున్న యవ
యములెట్లు వయస్సునుబట్టి మారుచుండునో యట్లే మన ప్రభువుల
పరిపాలనా విధము గూడ మారుచునేయున్నది.



చక్రవర్తి:—మానవ జన శిరస్సంత ముఖ్యమైనా, పరిపాలనమునకు చక్రవర్తి యంత ముఖ్యుడు. కీర్తిశేషులగు విక్టోరియా మహారాణీ గారి మనుమడగు శ్రీ పంచమ జార్జి చక్రవర్తిగా రిప్పుడు మన చక్రవర్తిగారు. వీరి కనేక మంత్రులుగల యొక యాలోచన సభ గలదు. దీనిని 'కాబినెట్' అని యందురు. వీరల సలహాల ననుస

—ఐదవ జార్జి చక్రవర్తి—

రించి చక్రవర్తిగారు మన దేశమునకు రాజ ప్రతినిధులను బంపుచున్నారు.

రాజప్రతినిధి:—ఇతడు మన దేశమునకు చక్రవర్తిగారి తరువాత చక్రవర్తియై యేలుచుండును. ఇతడు చక్రవర్తిగారిచే నియమింపబడినవాడై యైదేండ్లకొకసారి మారుచుండును. ఇతడు హిందూదేశపు రాజకీయ వ్యవహారములు బాగుగ దెలిసినవారిలో ప్రథముడు. ప్రస్తుతము లార్డు రీడింగు మన రాజప్రతినిధియై యున్నాడు. పరిపాలనమునందు వీరికి సలహానిచ్చుటకు కార్యనిర్వాహకసభ యొకటి యేర్పడి యున్నది. (Executive Council) ఈ సభవారి నైదేండ్లకొకసారి మన చక్రవర్తిగారు నిర్మించెదరు. ఈ సభకు రాజప్రతినిధియే అధ్యక్షుడై యుండును. ఇందితడు గాక యేడుగురు సభ్యులున్నారు. వారిలో ముగ్గురు మన దేశస్థులు. ఒక్కొక్క సభ్యు డొక్కొక్క శాఖ కధిపతియై యున్నాడు. ఇందులో మొదటివానికి సైన్యములపై సర్వాధికారము గలదు. రెండవవానికి పోలీసువారిపైని, జైలులు, న్యాయ



స్థానములు మొదలగువానిపై నధికారము గలదు. వీనిని హోం మెంబరని యందురు. మూడవ సభ్యుడు వ్యవసాయాభివృద్ధిని, కాల్వలు, బాటలు, ఆరోగ్యమార్గములు, తంతి తపాలాలు మొదలగువానికి నధికారులై యున్నారు. ఐదవ సభ్యుడు విద్యాభివృద్ధిని, ఆరవవాడు ప్రభుత్వమువారి ఖర్చు రాబడులను లెక్కచూచువానిగను, ఏడవ సభ్యుడు పద్ధతుల నేర్పరచునపుడు ప్రభుత్వమువారికి సలహాల నిచ్చువానిగను నుండును. ముఖ్యమైనవిషయములు వీరందఱును గలసి విచారింతురు. వారిలో నెక్కువమంది చెప్పినట్లు రాజప్రతినిధి చేయవలయును.

పై సభవారు హిందూదేశమంతయు న్యాయముగ బాలించుట కష్టమగుటచే దొరతనమువారు దేశమునంతయు కొన్ని రాష్ట్రముల క్రింద విభజించిరి. వీనిలో బంగాళము, చన్నపట్టణము, బొంబాయి, మధ్య పరగణాలు, అస్సాము, బీహారు ముఖ్యమైనవి. వీనిలో నొక్కొక్క రాష్ట్రము నొక్కొక్క గవర్నరు పరిపాలించుచున్నాడు. ఇతర రాష్ట్రములను బరిపాలించువారి కింకొకమోస్తరు పేర్లు గలవు. బర్మారాజ్యము నేలువారిని లెఫ్టినెంటు గవర్నరని యందురు. అంతకన్న చిన్నరాజ్యములగు అజ్మీరును బాలించువారిని చీఫ్ కమీషనర్లని యందురు. గవర్నర్లను చక్రవర్తిగారును, లెఫ్టినెంటు గవర్నరులను, చీఫ్ కమీషనర్లను రాజప్రతినిధిగారును నియమించుచున్నారు.

ప్రతిగవర్నరునకు నొక కార్యనిర్వాహకసభ గలదు. అందు రెండువిధములగు సభ్యులున్నారు. మొదటివారిని 'కౌన్సిలరు'లనియు, రెండవవారిని మంత్రులనియు నందురు. కౌన్సిలర్లు నలుగురుకన్న హెచ్చుగా నుండరు. వీరిలో నిప్పుడిద్దరు హిందువులై యున్నారు. వీరిని చక్రవర్తియే నియమించును. మంత్రులను గవర్నరే నియమించును. వీరలకు జీతములు గూడ గలవు. అవసరమును బట్టి గవర్నరు వీరి సంఖ్యను హెచ్చించుచుండును. ప్రస్తుతము మన మదరాసు గవర్నరగు విల్లింగుడను ప్రభువు సభలో ముగ్గురు మంత్రులు గలరు. ...లతి దినములలోని మన వెల్లింగుడను ప్రభువు లార్డు

[illegible] ప్రభువునకు గవర్నరుపదవి నొప్పగించి, యింగ్లాండునకు బో యున్నారు.

ప్రభుత్వమువారు ఒక్కొక్క రాజ్యము నేక జిల్లాలుగను, జిల్లా తాలూకాలుగను, తాలూకా ననేక గ్రామములుగను విభజించి యున్నారు. ప్రతిగ్రామమున నొక గ్రామ మునసబు గలడు. ఇతడు తాలూకా పెద్దయగు సబు మేజస్ట్రీటునకు లోబడియుండును. సబు మేజస్ట్రీటు జిల్లాకలక్టరునకు లోబడియుండును. కలక్టరు సివిల్ సర్వీస్ పరీక్షయందు కృతార్థుడై యుండవలయును.

పై సంగతులనుబట్టి జూడ, ప్రభుత్వము రెండుశాఖలు గలిగి యున్నట్లు మీ కగుపడుచుండును గదా! ఇందు మొదటిదాని పేరు 'ఇంపీరియల్ గవర్నమెంటు', రెండవదాని పేరు 'ప్రొవిన్షియల్ గవర్నమెంటు'. ఇందు మొదటి ప్రభుత్వమువారు విదేశీ వ్యాపారము, రైలుమార్గములు, తంతి తపాలా వార్తలు మున్నగు దేశోపకార కృత్యములను జక్కబెట్టుదురు. రెండవవారు రాష్ట్రమున కుపయోగ మగు సంగతులపై నధికారులై యున్నారు.

పైరీతి ననుసరించియే రెండు విధములగు శాసనసభలు మన దేశమున నున్నవి. మొత్తముపై సకలదేశ విషయములను గూర్చి చర్చించెడి దానికి సామ్రాజ్య శాసనసభ యని పేరు. (Imperial Legislature) ఇందు రెండు తరగతుల సభలు గలవు. మొదటి దానికి 'లెజిస్లేటివ్ ఎసెంబ్లీ' అనియు, రెండవదానికి 'కౌన్సిల్ ఆఫ్ స్టేట్' అనియు పేర్లు. లెజస్లేటివ్ ఎసంబ్లీలో 144 గురు సభ్యులు గలరు. వీరిలో 41 రిని ప్రభుత్వమువారు నియమించెదరు. మిగిలిన వారిని జనము లెంచుకొందురు. అట్టి జనులనే మనము 'వోటర్సు' అని యందుము. మూడేండ్ల కొకసారి యీ సభ్యులు మారుదురు. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సులో 60 మంది సభ్యులు గలరు. వీరిలో 33 రు జనులచే నెంచుకొనబడువారిగ నుందురు.

ప్రతిరాష్ట్రమునందును దాని కుపయుక్తమగు పను[illegible] నవ



రించి పద్ధతుల నేర్పరచుటకై రాష్ట్రీయ శాసనసభ యొకటి గలదు. మన రాష్ట్రీయ సభయందు 127 గురు సభ్యులున్నారు. వీరిలో 98 గురు ప్రజలచే నెన్నుకొనబడినవారై యున్నారు. వీరి సమ్మతిలేకుండ ప్రభుత్వమువారు మనపై పన్నులు మున్నగువానిని విధింపరు. పై రెండు సభలలోని, సభ్యులను మనమే యెంచుకొనుచున్నాము గనుక ఆయా సభ్యులు మన బాధలను ప్రభుత్వమువారికి ఎఱింగించి వానిని నివారణ చేయించుచున్నారు.

## 24. ప్రభుత్వమువారు మన కొనర్చిన మహోపకారములు

దేశచరిత్ర ముగింపక పూర్వము మన ప్రభుత్వమువారు మన కొనర్చిన మేళ్లను గనుగొనవలసి యున్నది. పూర్వకాలమందు మన పూర్వులనుభవించిన కష్టములను, మన మిప్పుడు పొందుచున్న సౌఖ్యములను బరిశోధించినచో వారలు మన కొనర్చిన మహోపకారములు మనకు తేటపడును.

1. శాంతము, నిర్భయత్వము (Peace and Security):— పూర్వము మన దేశమందు శాంతి యనునది లేదు. ఎందుచేత ననగా దేశమంతయు నొక్క ప్రభుత్వముక్రింద నుండక నానాజాతులవారి యేలుబడిలో నుండెను. ఎచ్చట చూచిన దోపిడులు, యుద్ధములు మున్నగునవియే యుండెను. నాదర్షా మున్నగువా రుత్తర హిందూస్థానమందును, బర్మావారు బంగాళమందును దేశక్షోభము గలిగించుచుండిరి. మరాటీ దండులు, పిండారీలు, థగ్గులు, పఠానులు దేశమును గొల్లగొట్టి స్త్రీ పురుషాదులన్న విచక్షణలేక యనేకులను జంపుచుండిరి. కాని మన కిప్పుడట్టి బాధలన్న మాటయే తెలియదు. చిన్న పల్లె మొదలు పెద్ద పట్టణము వరకు మనలను కాపాడుటకై ప్రభుత్వమువారు రక్షకభటుల నేర్పరచిరి. ఎవరైన దోపిడిగాని యితర నేరముగాని చేసినచో పోలీసువారు దానిని గనుగొని యధికారులకు దెలియ

వహించి మనలను నిర్భయముగ నుంచుచున్నారు.

ii. న్యాయ పరిపాలనము (Justice) న్యాయ పరిపాలన కొఱకు చంద్రగుప్తుడు, శ్రీహర్షుడు, అక్బరు మున్నగువారు కొన్ని కొన్ని చట్టముల నేర్పరచిరి. కాని వారి తరువాత వచ్చిన రాజులు వానిని మార్చివేసి, వారల మనోరాజ్యమే చట్టములుగ నేర్పరచుచుండిరి. మన ప్రభుత్వమువారిట్లొనరించక దేశమందు శాసన సభలను నిర్మించి, వా రేర్పరచిన పద్ధతుల ననుసరించి మనలను బాలించుచున్నారు. పద్ధతి విరుద్ధముగా నడచువారికి దగిన శిక్ష విధించుచున్నారు.

వివాదములను బరిష్కరించుటకై ప్రతి గ్రామమునందును గ్రామ మునసబు కోర్టులను స్థాపించిరి. జిల్లాలయందు డిస్ట్రిక్టు మునసబు కోర్టులను, ప్రతి తాలూకాయందును మేజస్ట్రేటు కోర్టులను స్థాపించిరి. పై న్యాయస్థానములలో న్యాయము దొరుకదని కక్షిదారులకు అప్పీలు కోర్టులు గలవు. డిస్ట్రిక్టు మునసబు కోర్టువారి తీర్పు యెవరికైన అన్యాయమని తోచినచో జిల్లాయందుండిన డిస్ట్రిక్టుకోర్టు కప్పీలు చేసికొనవచ్చును. ఇచ్చటకూడ నన్యాయమే జరిగెనని తోచినచో వారు రాజధానియందు గల హైకోర్టునకు అప్పీలుచేసికొని న్యాయమును బొందవచ్చును. కొన్ని సమయములందు వీరి తీర్పులపై గూడ నింగ్లాండులో నున్న ప్రీవీ కౌన్సిలునకు అప్పీలు చేయవచ్చును.

న్యాయమును జక్కగ బరిపాలించుటకై పోలీసువారిప్పుడు గలరు. వీరు నేరములను గనుగొనెదరు. ఇంకను నేరము లెప్పుడును జరుగకుండ మనలను గాపాడుదురు. పెద్దవారెవరైనను నేరస్థులైనచో వారిని శిక్షించుటకు మన ప్రభుత్వమువారు కారాగృహంబులను గట్టించియున్నారు. ప్రస్తుతపు కారాగృహ పద్ధతులలో గొన్ని మార్పులు జరిగినందున, పూర్వమునవలెగాక క్రమాగతముగ శిక్షననుభవించువారి యెడల ప్రభుత్వమువారించుక దయను జూపుచున్నారు. బాల్యులు నేరస్థులైనచో వారికి బ్రత్యేకముగ గారాగృహ



ములను గట్టించియున్నారు అందు వారి కనేకవిధములగు విద్యలను గఱపుచున్నారు. ఇట్టి కారాగృహములకు "రిఫర్మేటరీ పాఠశాల" లని యందురు.

iii. విద్యాభివృద్ధి:—పూర్వపురాజులు విద్యాభివృద్ధికై నంతగ పాటుపడి యుండలేదు. మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్సు, లార్డు రిప్పను మున్నగువారు ప్రజలందరు నభ్యసించెడి విద్యను నెలకొల్పిరి. నేటి వరకు విద్యాభివృద్ధికై ప్రభుత్వమువారు చేయు సహాయ్యము మిగుల శ్లాఘనీయము. తమంతట తామే గొప్పగొప్ప పాఠశాలలను గట్టించిరి. ఇంతియెగాక ఎవరైనను గ్రొత్తగా పాఠశాలను స్థాపించినచో వారికి గొంత ద్రవ్య సహాయ్యము చేయుచున్నారు.

బీదవారల కుపచరించెడి ప్రైమరీ పాఠశాలలను బ్రతి గ్రామమందును నొకటుంచిరి. పట్టణములందు సెకెండరీ; హైస్కూళ్ళను సర్వకళాశాలలను నుంచిరి. ఇందు స్త్రీలుకూడ నిరభ్యంతరముగ విద్య నభ్యసించవచ్చును. ఇందు రాజ్యాంగవిధులు; అర్థికస్థితులు; చరిత్రలు; ఆరోగ్యశాస్త్రము; దేహపరిశ్రమ మున్నగు విద్యలన్నిటిని నేర్పుదురు. అవి క్రమముగా జరుగుచున్నవో లేవో పరీక్షించుటకై విద్యాశాఖాధికారులుగూడ కలరు ఉపాధ్యాయులు విద్యను బాగుగా నేర్పుటకై ట్రైయినింగు పాఠశాలలను బెట్టి వారిని తర్ఫీదు చేయుచున్నారు.

విద్యయేగాక జీవనోపాధిని కలిగించు విద్యల ననేకములను దొరతనమువారేర్పరచిరి. ప్రతి రాష్ట్రమందును వైద్య కళాశాలలు, ఇంజనియరింగు కళాశాలలు, వ్యవసాయ కళాశాలలు, చిత్ర కళాశాలలు మున్నగునవి యేర్పరచిరి.

iv. ఆరోగ్యము:—వైద్యము, ఆరోగ్యరక్షణము ఈ రెండును జనుల క్షేమమునకు ముఖ్యమైన విషయములు. పూర్వకాలమునుండి మన దేశమునందనేక గొప్ప వైద్యులు కలరు. వారిలో "చరకుడ"ను వాడు ముఖ్యుడు. నేటికిని కొందరీ మహానుభావుని యనుసరించియే

వైద్యమును జేయుచున్నారు.

దొరతనమువారు మన యారోగ్యమునకై విశేషముగ ద్రవ్యమును గర్చుపెట్టుచున్నారు. వైద్యమును నేర్పుటకై పాఠశాలలను బెట్టి, అం దెందరినో కృతార్థులుగ జేయుచున్నారు. అట్టివారికి బట్టణములలో వారు స్థాపించిన ఆసుపత్రులలో నుద్యోగములిచ్చి బీదల కుచితముగా మందు నిప్పించుచున్నారు. మఱియు పశువులకు నుపచరించెడి మందులనుగూడ నిచ్చుటకు గొన్ని యాసుపత్రులను నెలకొల్పిరి. స్త్రీలకు గోషా ఆసుపత్రుల నచ్చటచ్చట బెట్టియున్నారు. ప్లేగు, స్ఫోటకము, కలరా మున్నగు నంటువ్యాధుల వలనను, జ్వరముల వలనను మనము బాధ జెందకుండునటుల మనకు మందుల నిచ్చుచున్నారు. కొన్ని పట్టణములందు మ్యూన్సిపాల్టీవారు, కొన్నిటియందు డిస్ట్రిక్టుబోర్డువారు కూడ నాసుపత్రులను గట్టించియున్నారు. పట్టణములందు మ్యూన్సిపాల్టీవారు మురికి కాలువలను దుడిపించుట, ఇరుకుగనుండు సందులను విశాలముగ జేయుట, త్రాగుటకు శుభ్రమగు నీటిని దొరకించెడి వసతుల నేర్పరచుట మున్నగు పనులను జేయుచున్నారు. ఇట్లనేకరీతుల ప్రభుత్వమువారు మనకు సహాయ్యపడుటచే మనము కష్టములను మరచి సుఖముగ నున్నాము.

vi. రోడ్లు, ఇనుపదారులు :—ఇవి రాకపోకలకు ముఖ్య సాధనములు. ఇట్టివి పూర్వము లేకుండుటచే మన పూర్వులు కాశీ, రామేశ్వరము మున్నగు పుణ్యక్షేత్రములకు బోవునపు డనేక కష్టములను బడి నడచుచు రెండు మూడు నెలల కద్యన్వస్థీయులైనచో జేరుచుండిరి. మార్గమధ్యమున దోపిడులు, జంతుభయము, శ్రమ మొదలగునవి హెచ్చుగ నుండెను. అందుచే వర్తకముకూడ బహుస్వల్పముగా జరుగుచుండెను. సామానులు ఎద్దులమీదను గాడిదెలమీదను మోసికొని పోవుచుండిరి.

కాని, డల్‌హౌసీ ప్రభువుకాలమునుండి క్రమక్రమముగ [illegible] రోడ్లను ప్రభుత్వమువారు వేయించిరి. మఱియు నినుప



మార్గములు కూడ వేయించిరి. వీనివలన వ్యాపారాభివృద్ధియే గాక జనులందరును గూడ నెన్నియో సుఖములను బొందుచున్నారు. వర్తకులు తమ సామగ్రి నొక స్థలమునుండి మఱియొక స్థలమునకు భద్రముగను శీఘ్రముగను దీసికొనిపోవుచున్నారు. ఒకచోట క్షామము దటస్థించిన నచటి కితర స్థలములనుండి త్వరగా నెగుమతులు చేయవచ్చును. అయోమార్గ స్థాపనవలన పరస్పరభావ మభివృద్ధియై జనులలో పూర్వముకంటె నిప్పు డెక్కువ నైకమత్యము వ్యాపింపబడినది.

vii. వ్యవసాయాభివృద్ధి :—ఈవిషయమున దొరతనమువారు చేసిన మేళ్ళు మిక్కిలి గమనింపవలసి యున్నది. కొన్ని పట్టణముల యందు వ్యవసాయ కళాశాలలను స్థాపించి నూతనములగు వ్యవసాయ పద్ధతులను నేర్పుచున్నారు. మఱియు వ్యవసాయాభివృద్ధి కుపచరించెడి నూతులు, చెఱువులు, కాలువలు మున్నగు జలాధారములను బెట్టి యున్నారు. గోదావరి, కృష్ణ మొదలగు నదులలోని జలము వ్యర్థము కాకుండ ప్రభుత్వమువా రానకట్టలు కాలువలను గట్టించి యున్నారు. గోదావరి నది పాయలలో ధవళేశ్వరమువద్ద యానకట్టు కట్టి గోదావరి జలమును కోటిఫలి మున్నగు తాలూకాలవఱకును యిచ్చుచున్నారు. ఈ కాలువలపై వర్తకముకూడ విశేషముగ జరుగుచున్నది. మఱియు ప్రస్తుత మెడారి ప్రదేశమగు సింధులో ప్రభుత్వమువారు వ్యవసాయాభివృద్ధి ననుసరించి సింధు నదీజలము నాయా ప్రాంతములకు పారుచుండునటుల నానకట్టు కట్టించుచున్నారు. (Sakkur Barrage Project.)

viii. స్వపరిపాలన ;—దీనిని మనలకు నేర్పుటకై ప్రభుత్వము వారు మన దేశమున మ్యూన్సిపాల్టీలను బెట్టించుచున్నారు. చిన్న చిన్న పట్టణములయందు యూనియనులను, అంతకన్న పెద్ద పట్టణములలో మ్యూన్సిపాల్టీలను, గొప్ప పట్టణములందు కార్పొరేషనులను యేర్పరచిరి. పై సభలయందు ఆయా పట్టణములందున్న ప్రజలచే నెన్నుకొనబడిన సభ్యులు కలరు. ఆసభల కాయా సభికులచే నెంచుకొన

బడిన అధ్యక్షుడు గాక యుండును. వీనినే మ్యూనిసిపల్ చైర్మన్ అని యందురు. చెన్నపురి కార్పొరేషను కెన్నుకొనబడిన మొదటి యగ్రాసనాధిపతి సర్ పిట్టి త్యాగరాయ శెట్టిగారు.

రోడ్లను దుడిపించుట, కాలువలను, మురుగుదొడ్లను శుభ్రపరచుట, రోడ్లను మంచిస్థితిలో నుంచుట, చీకటిరాత్రులందు దీపములను బెట్టించుట, విద్యాభివృద్ధి జేయుట మొదలగు విషయములను మ్యూనిసిపాల్టీ సంఘమువారు చూతురు. వారు అట్టి సభలకు సభ్యుల నెంచుకొనెడి యధికారమును బ్రజలకును, అధ్యక్షుల నెంచుకొనెడి యధికారము సభవారికిని యిచ్చుటచే మనకు స్వపరిపాలన నొసంగిరి. ఇటుల వీరు మనకు స్వపరిపాలనాశక్తి నిచ్చియుండుటచే నింతకన్న జిల్లాకును, రాష్ట్రమునకును నుపచరించెడి గొప్ప సభలలోగూడ కొంత కాలమైన తరువాత మనముగూడ పనిచేయుట కవకాశము గలిగించిరి.

ix. స్వయం ప్రయత్నము:—మనంతట మనము చేయదగు పని కితరుల సహాయ మపేక్షింపగూడదు. మన కుపచరించెడి పను లనేకములు మనము ప్రభుత్వమువారి సహాయ్యము లేకయే చేసికొనవచ్చును. దీని కుదాహరణముగ నొక గ్రామమును దీసికొందము. గ్రామస్థు లందఱును గలసి వ్యవసాయమున కుపచరించెడి ఎరువులను మున్నగువానిని చేసికొనవచ్చును. బీదసాదలకును, రైతులకును దరచుగ నప్పు గావలసి యుండును. వడ్డీ హెచ్చుగ నుండుటవలన వారు తిరుగా నద్దానిని దీర్పజాలరు. ఋణమును బుచ్చుకొనినవా రది యంతయు నొక్కసారి దీర్పజాలక వారి యావజ్జీవము ఋణస్థులై యుందురు. అట్టిబాధలను నివారించుటకై యిప్పుడు సహకార సంఘము లేర్పడి యున్నవి. (Co-operative Societies). ఇవి, సాధారణపు టుద్యోగస్థులకు వారికి గావలసిన ద్రవ్యమును వారి కవసరమున్నప్పుడు దీసికొని నద్దానిని బహు స్వల్పవృద్ధితో వాయిదాల వరుసను దీర్చుకొనుటకు, వీలు గలిగియున్నవి. తొలుత వీనిని ప్రభుత్వమువారే స్థాపించినను, క్రమముగా మన దేశస్థులే యీ సంఘములను బరిపాలన



చేయుచు, దేశీయుల కనేక విధములుగ సౌఖ్యములను గలిగించుచున్నారు. ఇందువలన రైతులును, మనము గూడ నెన్నెన్నియో సౌకర్యంబులను బొందుచున్నాము. ఇట్టి పైనుడివిన సౌకర్యంబుల నన్నిటి నొసంగిన మన "పంచమ జార్జి చక్రవర్తిగారు దీర్ఘకాలము జీవింతురు గాక!"

---

Printed at the King & Co., Vizagapatam.

